# విజ్ఞాపనము.

"ఒకరసద్విద్య యెందున్నఁ గొనఁగవలయు"

ఆర్యవర్యులారా !

నేనొకసారి, మూఁడేండ్ల క్రిందటఁ గాకినాడకు రెండుక్రోసుల దూరమునంగల కరపయనుగ్రామమునకు బంధువులింటజరగిన వివాహమునకుఁ జనియుంటిని. అపుడందొక యీడిగెకులమునాతఁడుభారతకథను రాత్రులయందు "ఆకపద" మని పాడఁజొచ్చెను. పెండ్లిపందిరికి సమీపమున నిది జరగుచుండుటచే నేనక్కడఁ గూర్చుండి వింటిని. భారతములోనున్న కొన్ని విషయములు వేఱువిధముగాఁ గారణముల నూర్చి చెప్పఁబడియుండుట వినినప్పటినుండియు నాకీతిసే యిట్టుగా నొక నాటకము వ్రాయవలయునని బుద్ధిపుట్టినది. ఇక్కాలంబున విద్యాధికులమనుకొనువారు పూర్వులమార్గమునననుసరింపఁ జాలక యీ సంగతి వెల్లడికాకుండఁ దామేదో క్రొత్తమార్గముం ద్రొక్కితిమనియు నెల్లరు నామార్గముననే నడువవలయుననియుఁ జెప్పుచుండుటచే నశక్తియుదర్జనత్వమను న్యాయమున నేనును బుక్కటిపురాణములంగ్రహించి వ్రాయుటయు నాగ్రంథమునే గౌరవింపుఁడనుటయు లోకమునకు రుచింపదనియు నాకిప్పుడు తెలిసినది. మఱియు రాజశేఖరాదిపూర్వపండితవిరచితంబులగు భారతనాటకములుండ నిప్పటికవిరాజశేఖరులగు తిరుపతి వేంకటేశ్వర కవుల భారతనాటకము లనేకములుండ నాయీ యల్పగ్రంథమును బైటఁబెట్టుట యతిసాహసమనియు గ్రహించితిని.

"చ. తెలివియొకింతలేని యెడఁ దృప్తుఁడనై కరిభంగిసర్వముం
దెలిసితినంచు గర్వితమనస్కుఁడనై విహరించితిఁ దొల్లి యిప్పుడు
జ్వలమతులైన పండితులసన్నిధి నించుక బోధశాలినై
తెలియనివాఁడనై మెలఁగి తొంగతమయ్యె నితాంతగర్వముం."

ఇట్లు విద్వద్విధేయుఁడు,

కొత్తపల్లి సూర్యారావు.

శ్రీమదుమారమణాయనమః.

# దుర్యోధనాభిమానము.

## ప్రథమాంకము.

చ. సవనముఁ జూడఁ బిల్వని వి॥చారముచే జనకుండు సేసెఁ ద
న్నవమతి యంచు; వచ్చిన న॥నాదృతి చూపెను మామ యంచు; మే
నువిడువ, యజ్ఞవాటమును॥నగ్గొనరింపఁగ, మూలమౌచు శాం
భవిని గిరీశుఁ గొన్న యభి॥మానము మీయవమాన మీఁగుతన్. 1

గీ. అలకుమారాస్త్రసందర్శ॥నార్థకృతస, మయసముద్భూతసంతోష॥మయమహోజ్జు
నాంబికేయుని గని మంద॥హాసరుచిర, మైనహరుమోము సభ్యుల॥కనయమోము. 2

నాంద్యంతమున సూత్రధారుఁడు—(ఆలోచించుచు నిలువంబడును)

నటి—(ప్రవేశించి) నాథా! మొదటనే యిట్టి సందేహాస్పదమగు నాశీర్వాదము వినఁబడినదేమి?

సూత్ర—ప్రాణేశ్వరి! నాదోషమిందిసుమంతయు లేదు.

నటి—(చేతులునలఁచుకొనుచు) దీనికాదికారణు లింకొకరున్నారా?

సూత్ర—ఒకరా, యిద్దఱా, ముగ్గురా! కులవృద్ధుల నేమియనుటకుం జాలను.

నటి—కులవృద్ధులనఁగా?

సూత్ర—అది తెలియకయే నీవు తొట్రుపడుచున్నదానవు.

నటి—స్త్రీసహజమగు నల్పజ్ఞానముచే నీప్రస్తావన సభవారికిఁగూడఁ దొట్రుపాటుఁ గలిగించునేమో యని వెఱచుచు వారియెడ నపచారముం గావించుచుంటిని.

సూత్ర—ఆయపచారమునకై సభాస్తారులను ప్రార్థించి ప్రసన్నులం జేసికొనుము.

చ. వినుము ప్రదర్శనం బనిన॥వెన్కటిగాథలఁ బొల్లుమాటలం
బనువుచుఁ బూనగ్రుచ్చినటు॥పల్కుటగా దితివృత్తచిత్ర సం
జనితమునంబు వేత్తలఁ బ్ర॥సాదరసాంబుధిఁ దేల్పఁగాఁదగుం
గనవె వినంగలేదె రసి॥కప్రవరుల్ ననుఁగాంచి మెచ్చుటల్. 3

నటి—అట్లయిన నేనాటకముఁ బ్రయోగించుట కార్యులు నియోగించిరి.

సూత్ర—అదినీవు ముందుగ వినఁదగినదియే.

గీ. ఒక్కదానికంటెఁ నొక్కటియెక్కటి, యీడుదీయవంచుఁ నెల్లజనులుఁ
ప్రస్తుతించునట్టిఁ రామనసూర్యరా, యాభిధేయము నాటకాళి వెలయు.

అందు నాల్గవదానిం బ్రవీణులరగు మీరు ప్రదర్శింపవలసిన దని సెలవిచ్చిరి.

నటి— మేలు, మేలు, దుర్యోధనాభిమానమా! (ఆలోచించి) తెలిసినది. నాథా! మీరనిన మువ్వురిలో గ్రంథకర్తయైనంతనె వ్యాసమహర్షిం జేర్చినారే!

సూత్ర— ఆ గ్రంథకర్తయే యీగ్రంథకర్త! కారణుఁడే యాతఁడు.

నటి— (ఆలోచించి) సుబలరాజు తనమనుమల నూర్వుర శపించెంగావున నతండొక కారణము కావచ్చును గాని యేపాపమెఱుఁగని భీష్మునిఁ జేర్చినారేల?

సూత్ర— వ్యాసమహర్షియుఁ గాక భీష్ముండును గాకున్న నొరులెవ్వరు?

నటి— శాంతనవుని దోషమిందేమి కలదు?

సూత్ర— వారమృతవాక్కులు. వారిదిదోషమనరాదు. దైవచోదితులై యట్లందురు.

నటి— పాపము శాంతించుఁగాక! దైవప్రేరణముచే దేవవ్రతుఁడేమి విరుద్ధవాక్యముం బలికినాఁడో!

సూత్ర— చ. జనపతి యాంబికేయునకుఁ సౌబలఁ బెండ్లియొనర్తు మేని వ
ర్ధనమగు వంశమంచును బృథాసతిఁ బాండునికూర్తుమేని వె
ల్గును గులమం చయత్నముగఁ గొల్వునఁ బల్కెను నాఁడు గోల్తె నా
శనవరతంబును న్మదికిఁ నందు స్ఫురించు నమంగళార్థముల్. 5

నటి— నాథా! యీపండితమండలి యెదుట నే నీమాటలలోని శ్లేషార్థములు తీయ సాహసించుచున్నదానను. వర్ధనమగునన్న వృద్ధియగుననియు ఛేదనమగు ననియుం గలదు గాని వెల్గుననినఁ దప్పేమి ప్రకాశించుననికాదా! ఒక యశుభవాక్య మొకశుభవాక్యముచేఁ గొట్టుఁబడునేమో.

సూత్ర— వెల్గునన బ్రకటము మండునని తోఁచుటలేదా.

నటి— (నిశ్చేష్టితదోఁప) ఎంతవారైననేమి. దైవవిలసితమున నోరుజాఱినదిగదా!

సూత్ర— అందులకై విచారింపకుము. ప్రస్తుతాంశమునకై కడఁగుము.

గీ. ఎఱుఁగరాక పుట్టుఁనెడరున కెద్దియో, ప్రతివిధాన మార్యుఁలతిరయమునఁ
జేసికొంద్రు గాదెఁ చీకురాజద్దాని, నెఱిఁగి రాఁజఁ బెట్టెఁ నేర్పుకన్నె. 6

నటి— నాకీ వృత్తిధృతరాష్ట్రుఁడే యందఱికంటె నెక్కుడు కారణమైనాఁ గనఁబడుచున్నాఁడు.

సూత్ర— ఈతఁడే కాఁడు. పోల విచారించినచో లోకమంతయు నేదియో కొంత దీనికి మూలమగుచునే యున్నది.

నటి—ఎఱిఁగి కొందఱు తెలుఁగక కొందఱు దీనికి సాహాయ్యముఁ జేయుచున్నారు.

సూత్ర—అధృతరాష్ట్రుఁడు-

చ. ఎఱిఁగిన యట్లు పల్కు విబుధేంద్రుల చెంగటఁ బుత్రులొద్ద వే
మఱుఁ బరివెట్టి వారిపయి మక్కువ నొందనలేఁడు ; వానికిం
దఱచు కనుంగొన న్మతిసుతత్రజ ముత్కటసౌఖ్యభాజనం
బుఱఁడు సుయోధనుం డరులనోర్చ నటంచని యుండ నోపెడుక్. 7

నటి—ఆర్యపుత్ర ! ఇఁకరండు. పండితులు మన యాలస్యమునకు సహింపరు.

సూత్ర—నిజమే.

గీ. వలదు వల దటంచు వారింప దాని నే, పెనఁగి చేసి వ్యసనములు గనువారిఁ
జూడలేదె యిప్పు చూచుచుండుట లేదె, యేల యింతవంత యింతిమనకు. 8

కానిమ్ము. మనవా రేమి చేయుచున్నారో (అని సభార్యుఁడై నిష్క్రమించుచున్నాఁడు)

(పిమ్మట బరశురామునితో బ్రాహ్మణవేషధారియైన కర్ణుఁడును బ్రచ్ఛన్నుఁడై యింద్రదూతయుం బ్రవేశించుచున్నారు)

పర—వత్సా ! అప్పటికి నిప్పటికిఁ గాల మెంత వ్యత్యాసముగా నున్నది !

కర్ణ—ఆచార్యోత్తమ ! ఏవిషయమై యానతిచ్చుచున్నారు ?

పర—సర్వవిషయములు నట్లే కనఁబడుచున్నవి.

కర్ణ—విప్రోత్తమ ! (సంశయముతోఁ దనలో) అయ్యో ! ఇట్లు సంబోధించితి నేమి ! (ప్రకాశముగ) యుగభేదముండదా !. సంధియందే యిట్లుండినఁ గలిప్రవేశించిన పిమ్మట నెట్లుండునో.

పర—ఇప్పటివారికిఁ జిన్నఁగా మాటలాడుటయైనఁ దెలియదు.

కర్ణ—(తనలో) విప్రులయందుఁ గూడ నిక్కాలమున నుచితజ్ఞానము లేదనికాని యేన న్నమాటపైఁ బల్కినట్లు తోఁపదు.

పర—అన్నిటియందలి వ్యత్యయము నట్లుండనిమ్ము.

మ. నృపదుష్టుం డలవోక యొక్కరుఁడు తండ్రి జంపినం గోపినై
శపథంబుం బచరించి తల్లికతనక్ష్మాక్షత్త్రాన్వయం బేడు మూఁ
డు పరుల్ ద్రుంచితిఁ బిన్నపెద్దలను నాఁడున్నాఁడుఁ ; బ్రాణంబుపైఁ
గృపణు ల్గాజులు చేతులం దొడిగి నారీవేషముల్ దాల్చఁగన్.

కర్ణ—మహాత్మా ! ఈపరాక్రమకార్యము త్రిలోకముల నాబాలగోపాలమునకుఁ దెలియును.

పర—వత్స! బ్రిదుకుదు మేమో యనునాసచేఁ బరశుహస్తుండనై కృతాంతాకృ
తి నున్న నాపైఁ గవిసి యీఁచపుల్లలవంటి నారాచములం బఱపి నాచే మడిసిన
యొక రాజాఘము నైనం బోలినవాఁ డిపుడు పొడసూపుటలేదు.

కర్ణ—దైవముతో నెదిరించువాఁ డెందున్నాఁడు!

పర—అట్టిపట్టుదలలో నున్న నన్నుం గాంచి—

మ. అతిఘోరం బిది బ్రాహ్మణోచితము కాదంచు న్మునుల్ విప్రులుం
బతిమాల న్విరమించి వారికి ధరాభాగంబు నర్పించి యుం
డితినిప్డీక్రియ మాటకైనఁ గలవో క్షత్రైక క్షాత్రమీ దేహము
ల్పతమం చెన్ని నృపాలు రాఁడుమళయాళం బీభువిం జేసిరో. 10

కర్ణ—(తనలో) కురుకుమారులనీతెఁ డెఱుఁగఁడు. (ప్రకాశముగ) గురువర్య! ఆదియట్టిదియే.

పర—రఘురామునివంటి క్షత్రియకుమారుఁడే కనఁబడుటలేదు. అట్టిచో బ్రాహ్మణుఁ
డవై శస్త్రాస్త్రవిద్యలతో నేమిప్రయోజనం బని యభ్యసించుచున్నాఁడవు?

కర్ణ—(భయముతోఁ దనలో) "బ్రాహ్మణుఁడవై" యనుట చూడ నామాయఁ గని
పెట్టెనా యేమి. అట్లయిన నేల శపింపఁడు. (ప్రకాశముగ) దేశికవరిష్ఠ! భార్గవ
రామశిష్యుఁడ ననుప్రఖ్యాతికే కాని వేఱు కాదు.

పర—ఎఱిఁగియుండుట మేలే కాని నీకివి యనుపయోగము లగును.

కర్ణ—(తనలో) అక్కటా! యీవిప్రవరువాక్యములు నాకన్నియు సంశయాస్పద
ములై యగుచున్నవి. "అనుపయోగములగు" నని యేయర్థమునం బలికెనో?

పర—అప్పటిదుఃఖములుఁ గోపములు యుద్ధములుఁ దలంపునఁ బాఱిన నిర్లిప్తుఁడనై
యున్న నాకిపుడు కన్నులనిండ నిద్రవచ్చుచున్నది. (అని యావలించుచున్నాఁడు.)

కర్ణ—ఆచార్యవర్య! నాయంకతలమున నొరఁగి శయనింపుఁడు. (అని తొడ సవరించు
చున్నాఁడు)

పర—(పండుకొని నిద్రను బొందును)

కర్ణ—(ఉత్తరీయముతో విసరుచు) ఆకారము చూడఁగా నీయది గాఢనిద్రవలె నగప
డుచున్నది. సందియము లేదు. రాజకుమారులతో నాటలాడుచు సంగడికాండ్ర
యి యుండఁ గొందఱిని సేవకులై యుండఁ గొందఱిని ధృతరాష్ట్రమహారాజు ని
యమించుతఱిఁ బ్రకటసానుసరణంబుగఁ జెలికాఁడనై యుండి వారలతోపాటు
కృపద్రోణులయొద్దఁ గలయంత విద్యయు నేర్చితిని. కుమారాస్త్రసందర్శనాదిసమయ
ములలో సుయోధనుఁడు నాపైఁ గనఁబఱచిన గౌరవమునకుఁగా సమయమువచ్చిన

పుడకొఱకు వచ్చిన, ట్లీతఁడు బ్రాహ్మణేతరులను శిక్షింపఁడు కావునఁ గపటవేషమున నశేషము నేర్చుకొంటిని. ఇంతదనుక నెట్లో బ్రాహ్మణాచారములు భాషణంబులు నిర్విచ్ఛేదంబుగా వాడుచుఁ గడపితిని. ఇది యెఱింగి తొలఁగిపోవున్నను భయములేదు. నిదురనుండి యీఘనుఁడు లేచినతోడనే యెద్దియేని మిషఁ గల్పించుకొని పోవలయును.

ఇంద్రదూత—(ప్రవేశించి) తిరస్కరిణీవిద్యచే బ్రచ్ఛన్నుఁడనైయున్న నన్నెరులు చూడలేరు. ఏనొపరులం గాంతును. పలుకు లాలింతును. నామాట లితరులకు వినఁబడవు. అక్కతన నెట్లువర్తిలిన నెగ్గలేదు. త్రికాలవేదియగు నాస్వామి యింద్రుఁడు స్వాంశాసంభూతుఁ డగునర్జునున కెప్పుడో యీకర్ణుఁడు విరోధియగునని తెలిసికొని యిచ్చట వీని యభ్యాసభంగముం గావింపఁ బంపిన వచ్చితిని. నాయజమానుని యూహలకు దగినట్లే యీదుర్నయుని మాటలు వినఁబడినవి. ఏయుపాయము పన్నుదును.! ఇక్కుటిలుని శరీరమున నావేశించి భార్గవుని యెదుట సూతకులాచారములం బ్రకటింతునా! లేక నిదురపోవుచున్న యీతనికి స్వప్నములోఁ గర్ణుని బ్రాహ్మణేతరత్వముఁ దేటపఱతునా! (ఆలోచించి)

ఉ. ఇట్టియులంతికార్యమున కేనరుగం దగ దీవుచాలవా
యెట్టులొనర్చెదో పరులకించుకయుం గనరాకయుండి యం
చట్టిటు వీఁపు తట్టి కడునర్మిలినంపిన వచ్చినాఁడనీ
పట్టునస్వామికార్యముశుభంబుగఁ దీర్ప నుపాయ మెద్దియో.

గాఢనిద్రలో నున్నవానికి నిద్రాభంగముఁ జేసితినా లేచి నన్నేలప్రబోధించితివని వీ నిందిట్టును-ఇది యంత మంచియూహ కాదు. మహాత్ముఁడగుట నన్నెఱిఁగిననాపైఁ గినియఁగలఁడు. కర్ణుఁడు కాలుకదల్చు నుపాయము చేయవలయును. స్వామికార్యనిర్వహణపరాయణుఁడనగు నన్ను దైవము కాపాడుం గాక !

కర్ణ—(నలువంకలఁ గాంచి) గురువుగారు సెలవిచ్చినట్లెవ్వరియొద్దను నర్మసహాయమైన కార్ముకమేలేదు. అదితలంచియే యిందీవరాక్షుఁ డాయుర్వేదమును బలె నే నధర్వణవేదమునకై యింత యొనర్చితిని.

ఇంద్రదూ—మాయయని తెలిసినపిమ్మట వానికిఁ బ్రాప్తించినశాప మెఱుఁగవా ?

కర్ణ—(దీనముగ) నాకాలిక్రింద నేదియో పురుగు ప్రాఁకుచున్నది.

ఇంద్రదూ—బళిరా! దానిచే నాకార్యానములేకుండ నీతఁడు కదలును. (ఆలోచనతో) పౌరుషశాలియగుటచే నీయులంతిపురువును లక్ష్యము చేయకుండవచ్చును. కావున నే

నర్థాని శరీరమునం జొచ్చి తగినట్లు కావించెదను. ఈకీటము నాకుఁ బరమోపకా
రి యైనది. బళిరా! దైవకార్యములకు క్షుద్రకీటకములును సాహాయ్యమొనరించుచు
న్నవి. (అని పరిక్రమించుచున్నాఁడు)

కర్ణు—అకటా! ఈపుర్వు నాకనర్థముం దెచ్చునేమో. నాకాలుకొఱుకుచున్నది.

క. కాలుకదల్చిన నీన, చ్ఛీలుఁడు మేలుకొని నిద్ర చెఱచితినని రో
షాలాపియగునయేని, న్మేలెల్లం జెడదొకో నిమిషకాలమునన్. 12

కటకటా! ఈపుర్గు నేలవిడిచి సాముచేయుచున్నది. అఁకిమిషట్టియుఁతమన్న నలవి
కాకుండ మాంసగతమైనది. దేహమందంతట సంచరించుచున్నట్లున్నది. (ముఖవికా
రముతో) నరములు త్రుంచుచున్నది. ఎమ్ముకలు దుంబోళ్ళు కావించుచున్నయది.
(నేల నానుకొనిన చేయియెత్తి నెత్తురుచూచి) ఏమైనఁ గానిమ్ము కాలుకదల్పను.

క. మిడుతవలె మున్నదోఁచెం, బడబాగ్నిం బోలె నిపుడు బగ్గనమండం
దొడఁగల మాంసుబెల్లం, జెడఁదినుచున్నయిది కీటచిహ్నంబగునే. 13

(రెండవచేయియెత్తి) భూమియెల్లం బనగలియు నీరక్తమెక్కడిది. పరిశ్రమకఠినంబైన
నాదేహమును క్షుద్రకీటము బాధించుట యచ్చెరువు. ఇంతరక్తమెట్లువచ్చినది!

గీ. వెల్లువలుగట్టె నింతటి వింతగలదె, నల్లయాను పేరు దీనికిఁ జెల్లదిచట
శోణితముచేసి భువియెల్లఁ జోద్యముగను, నక్తమై హస్తమంతయు రక్తమయ్యె. 14

ఇంద్ర—(మరలవచ్చి) కొఱికిన దొక్కనిమేషమే యయినను బ్రహ్మరంధ్రమంటించితిని.
అమితవేదనకలిగినను గురువుగారు లేచెదరని కదలలేదు. అప్పటికి నాకుఁదోఁచిన
కొంటెయూహతో నెవ్వరికిఁ గనఁబడకుండ నెత్తురు చాఁపక్రింద నీరువలెఁ జల్లఁ
గఁ బరశురాముని క్రిందిపక్క తడిసి మెలఁకువవచ్చునట్లు చేసి యీవలకు వచ్చి
తిని. మొదటిపురుగు భూమిలోఁ జొచ్చినది. ఇపుడేమిజరగునో చూచుచుండెదను.

కర్ణు—(అదరుపాటుగ గురువుం జూచి వినయుచు)

సీ. శ్వాసముండియుండి వ్యత్యస్తముగవచ్చు, ముకుపుటంబు లెగురు ముఖము విఱుగు
చూచ్నయది యొకింత చూచెడునట్లుగఁ, గన్నుఱెప్ప లెగసెఁ గదలునేమొ. 15

ఇంద్ర—ఏ నీవలకు వచ్చినను మండుటకై విషప్రయోగము కూడఁ గావించితిని.

ఉ. పాపము మో గురూత్తముని పైఁగల యాతనిభక్తి పెంపొ యె
వ్వారయినం దరంబె గుని పంబున వ్రేసినకంటెఁ బెట్టిదం
బైరహియించు శారదన మంటిన పోటు సహింప; నింతయుం
జేరికిఁగోఁడు ముందెటులఁ జిష్ణుఁడు విష్ణుఁడు వీనిగెల్తురో!

పర—(ఇటునటు కదలుచున్నాఁడు)

కర్ణ—మహాత్మా! శయనింపుఁడు. ఇంకను నిద్దురబద్ధకము తీఱలేదు.

పర—(కన్నులుమూసి యొడలు తడవికొనును)

కర్ణ—(వస్త్రముంగప్పి) ఒకింత నిద్రింపుఁడు. ఇంకను ప్రబోధకాలము కాలేదు.

పర—(చటాలునం జేయి నేలయాని లేచి యొకచేయి చూచికొని యద్భుతపడును.)

కర్ణ—(నిలువంబడి చేతులుజోడించి) గురువర్య! లేచినారేల?

పర—(రెండవచేయిచూచుకొని) ఇదియేమి?

కర్ణ—ఏమనివిన్నవించికొందును.

పర—(కోపముతో)

మ. లవణాంభోనిధులట్టివై దునృపకీలాలంబునం జెర్వులన్
భువిలో నిల్పితిఁ బాపనాశనముగాఁ భోగేచ్ఛవర్జించితిం
దవులంబో నొకట న్నిరీహుఁడను హృత్తాపంబు గావింపఁ బా
పివిగాకున్నను నెత్తుటం జొనుపుదే ప్రేరేపవేలేవఁగన్. 17

ఇంద్ర—కోపముపుట్టినది. కర్ణుఁడేమిసమాధానము చెప్పునో.

కర్ణ—నిద్రాభంగమగునని వెఱచితిని.

పర—ఓరినీచుఁడా! బ్రాహ్మణాని నెత్తురోటులం దేలితేలి యసహ్యించి విడిచిన క్షుద్రకార్యమున న్మరల దింపఁజూచుచున్నాఁడవా!

కర్ణ—(చేతులునలచుఁచు) నాయపరాధమును క్షమింపవలయును.

పర—నికృష్టుఁడా! నీయపవిత్రరక్తమునం దడిసిన యీదేహమున కేమి ప్రాయశ్చిత్తమున్నది!

కర్ణ—ప్రపంచమునంతను బవిత్రముచేయు మీదివ్యతనువునకును బ్రాయశ్చిత్తమా!

ఇంద్ర—సూతకులజుండవగు నీస్పర్శకు ముందు ప్రాయశ్చిత్తము కావలయు.

పర—(నేలంజూపి) ఇన్నెత్తు రెట్లు పొడమినది?

కర్ణ—ఆర్యవరేణ్యా! ఏమి విన్నవించుకొనుటకుం జాలను.

పర—(శరీరముం దడవికొని) నన్నుఁ జంపుటకేమైన యత్నించితివా?

కర్ణ—(చెవులుమూసికొని) శివశివ! అదియొక్కటి నాదుష్ట జన్మమునకుఁ గొఱఁతపడినదా.

పర—ఎట్లీయవస్థ నాకుఁ బ్రాప్తించినది?

కర్ణ—(బెదరుచు) మీకుపధానముం గావించిన నాతొడ క్రింద నేదియో పురువు దొలిచినది.

పర—తోడనే నన్నేల పరిశోధింప వైతివి ?
కర్ణ—నిద్రాచ్ఛేదమునం గోపింతురని.
ఇంద్రి—యిప్పుడైన నీపైఁగోపము తప్పినదా ! నీగురువు కోపమును విడువలేదు.
పర—(కర్ణుని కాలుచూచి) ఇంతవఱకును నాకు నిద్రాభంగ మనియే సహించితివా.
కర్ణ—సర్వజ్ఞులగు మీ కెఱుఁగరానిది కలదా !
ఇంద్రి—నీవు బ్రాహ్మణుఁడవు కావని కూడఁ దెలిసినది.
పర—(ఆలోచించి)

గీ. అగ్ని చల్లఁబడుట•యమృతంబు చంపుట, విషము జీవమిడుట•వినఁగవచ్చుఁ
గనఁగరాదు నెందు•వినరాదు నింతటి, పౌరుషంబు నోర్పు•బ్రాహ్మణునకు.

కర్ణ—(నేలంబడి మ్రొక్కి) విద్యాభిలాష నన్నింత యొప్పమి చేయించినది.
ఇంద్రి—ఇంకను జేయింపనున్న దనియుం జెప్పుము.
పర—నిజమంతయు విదితమైనది. ఓరోరి ! యసత్యవాది ! క్షత్రియాధ-సూతాధమ !
అగ్రవర్ణదురభిలాషీ ! పరశ్రీయసానహిష్ణు !
ఇంద్రి—అయ్యయో ! కమండలువు దగ్గఱ లేకపోయినదిగదా !
పర—నిన్నుం జంపినం బాతకము లేదు. కాని—

మ. సకలక్షత్రశిరోనికృంతనసుద•క్షుండైన నాకే లిసీ
వికటక్షత్రియకష్టసూతత ద్విజా•ప్తిక్ సిగ్గులే కిట్లు కొం
కక తాల్పం ద్విజరూప మేసరణినిక్•ఖండించి మున్బ్రాహ్మణ
ప్రకరం బౌనని మెచ్చఁ గొన్న ప్రతిన•వ్యర్థంగతిం జేసెదన్. 19
నే నంతటి పాపకృత్యముం జేయఁజాలను.

కర్ణ—మీదాసుఁడను నన్నేమి చేసినను జేయవచ్చును.
ఇంద్ర—ద్రోహము చేయఁడుగాని శాపమిచ్చునట్లు తోఁచుచున్నది. నిజమే యిట్టివా
రిం జంపఁ బనిలేదు.

ఉ. స్వాతిశయంబు హెచ్చిన కు•జన్ముఁడు చెట్టలు చేయఁబూని తా
నేతతి నెవ్వరేమనిన•నించుకయుం గణియింపకున్న చో
నాతని ద్రుంపనేల జను•లందఱు ఛీయని దూఱఁగా నసు
వ్రాతము పైనమైన బల•వద్గతినానుధయాపఁ జాలు నే. 20

పర—(కోపముతో) ఓరోరి దుష్టాత్ముఁడా ! నన్ను వంచించి నాయొద్దఁ జేరానతో
నేర్చుకొనిన విద్యయంతయు నీకు నిష్ఫలంబగుఁ గాత !

ఇంద్రదూ — బళి! బళి! ఏనే స్వామికార్యనిర్వాహకుఁడను

గీ. ఎఱుకలేనివాని కెత్తులు వెట్టుముఁ, జేయరాని పనులఁ జేయువాని
నెవ్వఁడైన దక్షుఁడీడిచికొట్టిన, వాఁడు దాను గూడ దారిఁ బడరె

ఇఁక నాకుఁ జాలును. శీఘ్రముగా నాస్వామికి వినిపింపవలయును (అనినిష్క్రమించుచున్నాఁడు)

కర్ణు — (పాదములపైఁబడి) జగదాధార రక్షింపవలయును.

పర — (దూరముగఁ దొలఁగి) నాప్రోలనుండి తొలఁగిపోయితివా రక్షింపఁబడెదవు. ఛీ! నీయట్టి యసత్యవాది యెదుటినుండి నేనే తొలఁగెదను. (అని కోపముతో నిష్క్రమించుచున్నాఁడు)

కర్ణు — అక్కటా! కుమ్మరి కొక్కయేఁడును గుదె కొక్కపెట్టు నన్నట్లు వచ్చినది. ఎంత సంతసపడితినో యంత వ్యర్థమైనది. దుర్యోధనాదుల నానందపఱచుటకై యత్నించి నాయానందముఁ గూడఁ బాడుచేసికొంటిని. గొప్పపండితులలో నిట్టి పక్షపాతము చాలతావులఁగలదు.

ఉ. ఏగతిఁ దాము నేర్చుకొని రెల్లకళల్ గురులైన శిష్యుల
న్నాగుగఁ దీర్పఁబండితులు పాల్పడ రొక్కని కల్మికోర్వరి
ల్లెగుచునుండఁ గాలము మహింగళలన్నియు నంతరింపవే
సాగునె లోకయాత్ర సదసజ్జనభేదము రూపు మాయదే. 22

గురులకు నమ్మకపుట్టెనాశిష్యుని దమయంతవానిం జేయుదు రనుటకు సాక్ష్యము ద్రోణాచార్యునియొద్ది యర్జునుఁడే. ఇదియును నేననవలసినదియే. గురువులను వంచించి లోకమంతయు బుగ్గఁబెట్టుకొనఁ దలఁచినవాని శృంగభంగమున కిప్పటి నేనే నిదర్శనము. ఇఁక నేమిచేయుదును. నాకిట్టిశాపము వచ్చినట్లు దుర్యోధనాదులకుఁ దెలియకుండ నటించుచు బరశురామునివలన సంప్రాప్తమైన చమత్కారవిద్యయంతయు వారి యెదుటఁ గనఁబఱచెదను. యుద్ధములో నిష్ప్రయోజనమైన వగుం గాక వినోదము చూపుటకైన నుపకరింపక పోవునా! అలవడినవిద్య యంతరింపకుండఁ గ్రమక్రమాభ్యాసమున గాపాడుచుండెదను. వృద్ధి కాకున్నం బోయె, నిల్చియున్నం జాలును.

ఉ. సూతుఁడ నన్ను దుఃఖమునఁ జూఁడుచునుండఁగ విప్రశాపము
ల్ఘాతముఁ దెచ్చువ న్భయము వగ్రముగాఁ బులిమీఁదిపుట్ర యీ
రీతిని జామదగ్న్యుఁడు పరిస్ఫుటశాపరసాబ్ధిముంచె నే
చేతమి సిగ్గుమాలి తలయెత్తెదనో పదిమందిలోపలన్.

(నిష్క్రమించుచున్నాఁ

శ్రీమదుమారమణాయనమః

# దుర్యోధనాభిమానము.

## ద్వితీయాంకము.

(దుర్యోధనదుశ్శాసనులు ప్రవేశించుచున్నారు.)

దుర్యో—తమ్ముఁడా! అనుదినంబును దండ్రిగారు చేయు నీయవమానమును భరింపఁ దరముకాకున్నయది.

దుశ్శా—అన్నయ్యా! తండ్రిలేనివా రనియుఁ దన కత్యంత సాహాయ్యముం గావించిన ప్రియసోదరుని పుత్రులనియుఁ వారి పై నట్టిప్రేమఁ జూపుచుండెనేమో.

దుర్యో—ఆత్మజులపై కంటె నొరులపై నెక్కుడు ప్రేమఁ యెవ్వరికైన నుండునా.

దుశ్శా—ఉ. ఉండిన నేమిహాని మన యున్నతిఁ బాండవు లాఁపఁజాల రా
ఖండలు వైభవంబును నఖండమహీవలయాధిపత్య మీ
రెండును వారి కెట్లొదవుఁ గేవలఁ గల్లరిప్రేమ చూపి తా
ర్యుండఁగఁ బెట్టుకొన్నను మహోన్నతుల న్భయమంద నేటికిన్.

దుర్యో—భయపడుచుంటివా! అగును! నీవనినట్లు భయపడవలసినదే. ఇంకమీఁద నీవనిన యఖండమహీవలయాధిపత్యమును కౌరవరాజ్యవిశేషణమునకుఁ జెఱుపుకలుగ నున్నదని నీవెఱుంగవు.

దుశ్శా—భ్రాతృవత్సల! అది నేనెన్నఁడు నెఱుంగను.

మ. పితృపైతామహమైనయట్టి నిఖిలోర్వీభాగమ న్లోకవా
ర్తతృణీకార్యము గాని పాండుధనుర్వ్యద్ఘోషణాయత్త ము
ర్వీతలం బాతని యాత్మజాతులకు వర్తిల్లం గదు న్యాయ్య మె
ట్టితటి న్వారును నిన్నుఁ గొల్చెదరు తండ్రిం బోలె నీవేలినన్. 2

అని ధర్మజు నొద్దనే కలహాశనుండు చెప్పుచు నారాకఁ గాంచి కుమారాస్త్రవిద్యాప్రసంగంబునకుం దింపినాఁడు. ఆమాటలకు గర్వము హెచ్చి యేమొ యాయైదుగురు నేను సమీపించినపుడైనఁ బీఠములపై నుండి కదలరు.

దుశ్శా—(చిఱునవ్వుతో) దానికేమిలే.

దుర్యో—అంతయభిమానము చచ్చినవారమనుకొనిరా!

దుశ్శా—అన్నయ్యా! మనలో మనమె గౌరవము తెంచుకొనవలయునా!

దుర్యో—వెఱ్ఱివాఁడ! మనలోమనమైన హానిలేదు, నారదాదులున్నపుడైనవలదా!

దుశ్శా—అట్టియభిమానవంతు లక్కడికిఁబోరాదని తలంచెదను.

దుర్యో—నీకీవిషయము తెలియదు. కర్ణునితో నాలోచింపవలయును. క్షత్రియోత్తరుం డగుటఁ బక్షపాతమువిడిచి చెప్పును.

దుశ్శా—ఇట్టివిషయములతోఁ జెప్పఁగూడదు. కర్ణుఁడు మననిమిత్తమై మనోవ్యథం దెచ్చిపెట్టుకొని కృశించుచున్నవాఁడు. అతఁడేమి నూత్నములం జెప్పఁజాలును!

దుర్యో—స్నేహితుఁడన్న నతనివంటివాఁడు వేఱొకఁడులేఁడు. (అంతటఁ గర్ణుఁడు దైన్యముతోఁ బ్రవేశించుచున్నాఁడు.)

దుశ్శా—అన్నా! రారమ్ము. తలంపులో నీవచ్చితివి. కూరుచుండుము.

కర్ణ—(కూరుచుండును.)

దుర్యో—నారదునివాక్యములనిమేము విశ్వసింపలేదుగాని యస్త్రసందర్శనావసరంబున నీసంకోచభావము మాత్రము మాకుసందేహముఁ దోఁపించినది.

కర్ణ—అన్నియు ననుగుణముగానె యున్నవి. (అనితలవాంచును.)

దుశ్శా—రాధేయ! ఏలవిచారము. ఈపేరుపెట్టుకొన్న ధానుష్కులందఱుఁ బరశురామశిష్యులేనా?

కర్ణ—తమ్ముఁడా! అట్లే నేనును నలువురిలోనివాఁడను గానైతినిగదా!

దుర్యో—వగపంబనిలేదు. ఇప్పటినీధనుఃకౌశలంబు పార్థుని గెల్వంజాలునటే.

కర్ణ—ఇంటనుండియే నీవు భీముం జయించునంతవాఁడవైతివి. అఖిలకష్టముల కగ్గముయ్యును గొఱగాకపోయితిని.

దుర్యో—అట్లైనన్నఁటికిఁ దలంపకుము. నినుబోలు వీరుఁడెవ్వఁడు?

దుశ్శా—కాకేమి అవిచారమున కవకాశములేదు.

కర్ణ—(నిట్టూర్చి) కానిండు! జరగఁదలఁచిన దేదియోమానదు. కర్తవ్యంబేమి.

దుర్యో—రాధేయ! చక్కఁగఁ దలంపునకుఁ దెచ్చితివి.

క. ఎవ రధికారం బిచ్చిరొ, యెవరింటం దాముగలరొ యిదిమఱచినదా
యవమానముఁ జేసెదుపాం, డవదుష్టులగర్వ మే నడంపన్వలయున్.

దుశ్శా—(నవ్వుచు) అధికారమిచ్చినవారియెడ వినయముగా నుండవలయుంగాని వచ్చినవారికెల్ల వంగివంగి సంచరించుట కెవ్వరితరము.

కర్ణ—అధికారిపుత్రులధికారితో సములకారా! ఇదియేను బలుమాఱు చూచితిని.

దుర్యో—దీనికుపాయము లెస్సగ నరసి చెప్పవలయును.

కర్ణ—ఈపని నాగోటిలోనున్నయది.

దుర్యో—(సగము లేచి యాసనములో) దుశ్శాసన! కంటివా! కర్ణు నే సూతకపు
డెవ ననుకొంటివి. సమయోచితాలోచనము లితనిసొమ్ము.

కర్ణ—(ఆలోచించి)

గీ. బంతులాడఁ బిలువఁ బంపుము క్రీడిని, భీముఁ బొద్దుపోవు వేళ నిటకుఁ
బిలువ నున్నయది సువిస్తరమానాదు, పన్నుగడ వచింతు వారి నొంప.

దుశ్శా—వారియువురిలో నెవ్వరికి కందుకక్రీడలో నైపుణ్యమున్నదో.

కర్ణ—అందఱు సమానులే కాని వీరియువురం గొంచెము పడుచుఁదనపుమాటలచేఁ గ
న్నాకులవలెఁ బల్కుచుందురు.

దుర్యో—ఇది బాగుగానున్నది. వీరింగూర్చి యోచనను వినియుంటిని.

గీ. గురుఁడు మున్ను నూఁత గూలినబంతిని, బాణరజ్జువునను బైటకెత్తె
నాఁడు గోలె వీరు నానావిధక్రీడ, లలవరించుచుండి రట్టిరీతి.

తమ్ముఁడా! యీవిషయముం జెప్పి కందుకక్రీడ గావించు స్థలమునకుం బిలిచికొనిరమ్ము.

దుశ్శా—ఈపని తలంచినపుడే కావలయునా ?

దుర్యో—ఏవిధముననో శీఘ్రముగ నవమానింపనున్న నాకుఁ దోఁపదు. ఏమందువా

గీ. గర్వముననేని దుర్వివేకముననేని, బరులొనర్చు దుష్కార్యము మఱిసినయము
ననో భయంబుననో తెల్పఁ జనము వారు, మానెదరు మానవమందు రాపైనఁగలదు.

కర్ణ—భీమార్జునుల నవమానించుట యెంతపని.

దుశ్శా—(తనలో) ఇతనిపోటుమాటలు మాజీఁత యన్నగారిం జెఱచుచున్నవి. (ప్రకా
శముగ)

గీ. ఒరులనగఁ జేయు నూహించునప్పుడు, తమకు నెవరిదెబ్బ తగులకుండ
వేగపడక మంచి వేరవున నొనరింప, వలయుఁ నేఁటికేల త్వరపడంగ.

దుర్యో—తమ్ముఁడ! కర్ణుఁడు తెన్నుగ విచారించి చెప్పినమాట గాని వేఱొకటి గా
దు. ఏవంకఁ జూచినను వారికన్న యన్నిలోపములు మనకుఁ గనఁబడవు. చూడుము

చ. ఒకపులవంచఁ జేరితి నొయున్నతి గర్వము వాఁ దిపామొ నే
లోకరికిఁ బుట్టి పాండుతనయో క్తిని లోకుల మోసపుత్తుమో

కర్ణ—ఒకవిషయంబ కాదు బకయుద్ధము మేమము పెద్ద బెట్టు నిం
చుకపనితోన తన్ననము శూన్యము చేయుట మేలువారికిక.

దుర్యో—అల్పజన్ముల కహంకార మెక్కుడుగదా!

దుశ్శా—(అపహసించి) ఈమాట నీవు కర్ణునియెడఁ బలుకఁ బరులంగూర్చి గొనఁబలుకరా

కర్ణ—అడవిలోఁ బుట్టినవారగుట మృగప్రాయులు. వారియహంభావమును మదము ట్టించు టెంత.

దుశ్శా—మాటలతో నేమిప్రయోజనము. ఎవ్వరికిఁ దగిన మాటలు వారికుండును. వారడవిలోఁ బుట్టలలోఁ జెట్టులలోఁ బుట్టిరి మనము మేడలమీఁద మిద్దెలమీఁదఁ బుట్టితిమి. ఇంతియవాసి.

దుర్యో—మనకేలోపములున్న విరోధి వ్రేలుమడఁచి చెప్పును.

దుశ్శా—మాటపడినవారేదియో పోటుమాట యాడకమానరు. కావున నాచార్యునకుఁ దెలియకుండ నశ్వత్థామతో మంతనము చేయుటమంచిది.

కర్ణ—అరణ్యోత్పన్నులగుటను పాండుశాపము ప్రకటమగుటను వారి జన్మమును గుఱించి సందేహమున్నదా లేదా!

దుశ్శా—(కోపముతో) తక్కినవారందఱుం దమతల్లిదండ్రుల బాగుగ నెఱింగియే యున్నారా! చాలింపుము. (కోపముతో)

చ. కుమతివిఁ బోలెనాడెదవు కూడదు నీ వెటువంటి ప్రాణమి
త్రమువయినం బృథాసుతులు ప్రస్ఫుట కాంతిప్రపూర్ణులైన మాకుఁ దే
కుమ యిట వారినింద పగఁగొందురుగాక సహింపఁజాలరె
ట్టి మనుజులైన నన్యు ప్రకటించెదు బాంధవనింద కింతియుం గా.

దుర్యో—కర్ణా! కొండొకయగుపిని వాక్యములం జాటింపకుము.

కర్ణ—దానికేమి; పాండవుల—కాదు కౌంతేయులఁ జిన్నపుచ్చవలెనన్న బంతులాడునపు డోరోరి కుంతులార! యని సంబోధించినం జాలును.

దుశ్శా—(కోపముతో) ఏటిమాట! చిన్నపుచ్చుట యెంతపని చిన్నవోవుట యెంతపని.

గీ. ఉన్నమాట యున్న నులుకెవ్వరికి నెక్కు, డట్టియెడలవారి ననుటయేల
నోరి మీఁదగ్రుడ్డి వారిపుత్రులు కారె, యన్నఁ జాలు మనకు ఖిన్నతను.

దుర్యో—ఇంతలోన మనకేమి హాని. దాని నెఱుఁగనివారెవ్వరు?

దుశ్శా—ఏననునదియు నదియే వారి నెఱుఁగనివా రెవ్వరు?

కర్ణ—నీవీమాటలోనికి రామానెదవు గాని వారిం బిలిచికొనిరమ్ము.

దుశ్శా—మనమే గడుసువారము. నాకేమి పిలిచెదను. (అని వెళ్లుచున్నాఁడు.)

దుర్యో—మనముఁ గూడఁ బరికరములతో వత్తము, రమ్ము. (అని కర్ణునితోఁ బోవుచున్నాఁడు)

(పిదప భీమార్జునులు ప్రవేశించుచున్నారు.)

భీము—వీర లహంకారాపరులనుట స్పష్టమైనదా!

అర్జు—కాకేమి! సుయోధనుని చూపోపమి యంతయు నీపైఁ గనఁబడుచున్నది.

భీము—అది యటుండనిమ్ము. సంబంధములేని రాధేయుని చూడ్కి యంతయు నీపై నున్నది. ఇది నీవెఱుంగవేమో.

అర్జు—అందఱుం గనిపెట్టుచునే యున్నాఁడను.

ఉ. ఆటలలోన భోజనములందున స్యందనవాజివారణా
ఖేటవిహారవేళలను గీమున నూరక కూరుచున్నచో
మాటుగ నిన్నుఁ జూచి పలుమాఱును నాదెసఁ గాంచి యేమియో
మాటలు చెప్పుకొంద్రు విసమానసరూక్షనిరీక్షణాస్యులై.

భీము—సవసవగా నేనును గనుఁగొనుచుంటిని. ఇంతన మనకేమిహాని.

అర్జు—నిరాయుధులమైన మనపై సాయుధులై వారు గవియలేరు.

భీము—వారి యసూయయు దురభిమానమును వారినేల చెఱపవు. నిన్ను నన్ను నేమి యన్నను బాటింపరాదు గాని యన్నగారిపై నీర్ష్యకనఁబఱచినపు డూరకుండరాదు.

అర్జు—అది మనయందుకంటె నెక్కుడుగానే యున్నది. పోటుమాట లన్యాపదేశగ నాడుచునే యున్నారు.

భీము—(కోపము తెచ్చుకొనియు) తమ్ముఁడా! వారు మనల మాటల నెంత యులయించినను మనసు నొచ్చుదాఁకఁ ద్వరపడరాదు.

అర్జు—మనోవ్యథకలుగకుండఁ గ్రోధము పుట్టనే పుట్టదు.

భీము—అట్లని వారి యెదుట మిన్నకున్నచో లోకువయగుదుము.

అర్జు—మనమెంత. తండ్రిని లోకువకట్టినట్లు తోఁచుచున్నది.

భీము—గురుతిరస్కారఫలము వ్యర్థముగఁబోదు.

అర్జు—రాధేయుని మూలమునఁ గొంత చేడ్పాటు వాటిల్లుచున్నది.

భీము—అది మనవారి గొప్పలోపము. తమకూహచాలక యతని నడుగ నేవేని దుర్మంత్రములు చేయుచున్నాఁడు. చెప్పినవారి దోషమందేమియున్నది.

అర్జు—అశక్తులు చెప్పినట్లాచరింపఁజాలక యుపదేష్టల కెగ్గుదెచ్చుచున్నారు.

భీము—లోకములోఁ జిరకాలమునుండి యిట్టిది కలదు.

గీ. అబలు లధ్యాంతరప్రవాహావతరణ, మునకు నొక్కని చేయూఁతఁగొని నడిమికి
నేఁగి యోపంగ వేరొకఁ గాఁగిలించు, కొని యడంపరె తమతోన ముంచి యతని.

అర్జు—బంతియాటకై యింత ప్రయత్నముతోఁ బిలిపింపఁ గతంబేమియొ?

భీము—కర్ణాలోచనమున కీడేని గావించుటకుఁ గావలయును.

అర్జు—అన్నా! ఇతఁ డింత వెఱ్ఱివాఁడేమి?

భీము—కాఁడా, అతని ననినవాఁడు వెఱ్ఱివాఁడు.

అర్జు—స్వవినాశ మెఱుంగనివాఁడు వెఱ్ఱివాఁడు కాఁడా?

భీము—అది పరవినాశమునకు ఘనోపాయమని విఱ్ఱవీఁగుచున్నాఁడు.

గీ. ఒక్క వాచాలు వెక్కృతిఁ గుబ్బిచేర్చి, తమమనోహరవాక్యకోశము మఱఁగించి
యొరుల నాతఁడు గర్హింపఁ జుండవచ్చు, కోనుచు నపకీర్తిఁ బడువారిఁ గనుటలేదె.

(బంతిపట్టుకొన్న కర్ణదుశ్శాసనులతో దుర్యోధనుని ప్రవేశము)

దుర్యో—(ఎదుటఁజూచి) భీమన్నా! వచ్చితివా! మనస్సు వ్యాకులముగానుండఁ బ్రొద్దుపోకకై పిలిపించితిని.

భీము—మావలన నీమనోవ్యాకులము తీఱునా!

దుర్యో—కార్యాంతరమున మనసుకొల్పితిమా యేమఱుపాటునఁ దీఱ నేవచ్చును.

అర్జు—అది పుట్టుటకుఁ గారణమేమి? ఇపుడు మనము చేయవలసినదేమి?

కర్ణ—(తనలో) మీమూలమునఁ గలిగినది, కావున, మిమ్మవమానింపవలయును.

దుశ్శా—(తనలో) కర్ణునివలన నన్నియుఁ గలుగుచున్నవి.

భీము—వ్యాకులోపశమనమునకుఁ గృత్రిమవినోదము లుపకరణము లగునా!

కర్ణ—(పరిహాసపూర్వకముగ) వీరవినోదములం బ్రొద్దుపుచ్చు క్షత్రియకుమారులు బాలక్రీడలఁ గావింతురా.

దుర్యో—ఇప్పుడదియే ప్రస్తుతముగా నగపడుచున్నది.

దుశ్శా—(తనలో) ఈకర్ణుఁడేదియో యుపక్రమించినాఁడు. దాని కన్నగారపుడే బలే యని తాళము వేయుచున్నారు.

భీము—గీ. చతురచతురంగబలసమన్వితుఁడు దుర్భ, రాహవవిజేతచదరంగమాడునట్లు
బాలురట్టుల మనమిప్డు కేళినలుప, డేగచెడి మిడుతలను బట్టినవిధమగు.

కర్ణ—(జనాంతికముగ దుశ్శాసనునితో) నేతిబీరకాయవంటి క్షాత్రమున కెంతలెంతలు ప్రగల్భములు గొట్టుచున్నాఁడో!

దుశ్శా—(తనలో) ఈపలుకు భీమునిగూర్చిన దైనను మాయందఱకు వర్తించును.

అర్జు—(తనలో) ఈకర్ణుని గుసగుసలు దుశ్శాసనునితోఁ గాన సరిపడినవి. ముఖవైఖరిం గన మమ్ముఁగూర్చియైన నిందవలెఁ గనఁబడుచున్నది.

శా. ధర్మపాలాత్మజు లాచరించెదరు ప్రసంగప్రౌఢి నో కర్ణుఁడా
యే పాటింగొలఁగాని ప్రేలరి యొనర్తే మేని దుర్యోధన
శ్రీ వెల్గొమనమేనడంచెదనుగానీ చూతుగా కెన్నఁడే
న్యాయంబుల్ పాలివోయిన న్విడవు నా చాపంబు దూపుల్చినన్.

దుశ్శా—(తనలో) రత్నకుండలకర్ణుఁడై జనించినకతమునన్ యొకరియుచ్ఛ్రయము విని పైఁపఁజాలని కర్ణములుగల వాఁడగుటనో కర్ణుండని యీరాధేయునకన్వర్థ నామము కలదు. పైఁగానిపు డన్నగా రిచ్చిన కొమ్ములు ముదిరి కన్నులు మూసికొని తిరుగుచున్నాఁడు.

దుర్యో—సాభిప్రాయముగ భీమన్న! మనమాడునది బాలక్రీడవంటిది కాదు. ఆహవమున కొకయంగమువంటిదే.

కర్ణ—వినోదమున కీయాటయైన నేమి. క్షత్రియులందఱు యుద్ధము చేయుచు నేయున్నారా యేమి?

భీమ—ఏమిమాట! యుద్ధము చేయకున్నంతనె క్షాత్రము చెడునా.

దుశ్శా—క్షత్రియధర్మము రాధేయునకేమి తెలియును.

అర్జు—(తనలో) జ్ఞానవంతుల కీమాట శూలమువంటిది.

కర్ణ—మరున్నందన! ఏ మనుచుంటివి?

భీమ—(కోపముతో) మా ప్రసంగమునకు నీవడ్డురావల దనుచుంటిని.

దుశ్శా—(తనలో) ఈకర్ణుఁడు కార్యకౌశల్యము చూపక వాక్యకాఠిల్యము చేతనే తన నీచత వెల్లడించుకొనుచున్నవాఁడు.

అర్జు—(తనలో) అన్నగారు భీమనామమునకుం దగినట్లు కర్ణునదలింపలేదు.

దుర్యో—కర్ణా నీవూరకుండుము, భీమసేన, నావాక్యములకే ప్రత్యుత్తరమిమ్ము.

దుశ్శా—(తనలో) నీముఖమున నుచ్చరింపఁబడినంతనె కర్ణవాక్యములు నీవాక్యములగునా!

అర్జు—(క్రోధముతో) మీరెవ్వరివాక్యము లయిననువినుటకే వచ్చితిమి. అందఱును జెప్పవచ్చును.

దుశ్శా—(తనలో) ఏదియో గొడవఁ బెంచుటకే యన్నగారు వీరలం బిలిచిరి గదా కానిమ్ము.

కర్ణ—అర్జునా! మాటలు వినుటయే కాక మీవలనఁగాఁగల కార్యమేది?

దుర్యో—కర్ణా! నీవూరకుండుము. భీమార్జునులార! నామాటలు వినుండు.

భీము—(కోపముగ) మమ్మెందులకని పిలిపించితివి?

అర్జు—(కోపముగ) ఈరాధేయునిచే నుల్లికుట్టుమాటలాడించుటకు.

దుర్యో—విస్మరిపించుట నన్నునిపించుకొనుటయేగదా.

కర్ణ—(తనలో) ఈమాటలు పెదవులతుదినుండి వచ్చినవి. కాఁబట్టి నేనూరకుందును.

దుశ్శా—(తనలో) నిజముగా నిట్టియూహాకలవారు చెప్పుడుమాటలు విని చెడిపోరు.

భీము—చెప్పు చెప్పుము. విందుముగాక!

దుర్యో—మనము తన్నుబంతి యాడుకొనవలయునని రప్పించితిని.

భీము—మాపైపున నాడువాఁడేఁడి?

కర్ణ—ఏనెందును జేరను. మీరునలువురేయాడుఁడు.

భీము—నీవున్నంతన మాకేమిభయముమా, ఇంకనిద్దఱు కర్ణులురండు. నాముసుమున నే నొక్కఁడంజాలదును

అర్జు—(కర్ణునితో) మనమిరువురమాడుదమురమ్ము.

భీము—(దుర్యోధనునితో) మనమిరువురమాడుదమురమ్ము.

కర్ణ—భీమసేన! ముందుగ మీయాటకానిండు.

దుర్యో—బాగుగానున్నది. మనమే మొదట నాటప్రారంభింతము.

అర్జు—(తనలో) ఎట్లయినఁ గర్ణునిమాటపై నిలువవలె నేకాని మననుమలోసత్తువలేదు.

దుశ్శా—(తనలో) ఇక్కడనే కాదు. ఇట్టివారు ప్రత్యాస్థానమునం గలరు.

భీము—ఈపాటిపనికీకర్ణుని యుపోద్ఘాత మేమిటికి?

కర్ణ—ఉపోద్ఘాతములేనిగ్రంథముండునా?

అర్జు—వెఱ్ఱివాఁడ! ఉపోద్ఘాతము చేతఁగాని గ్రంథకర్తకు సామర్థ్యముడుగవలయునా!

(అని లేచి యందఱితో నిష్క్రమింతురు)

ఇది ద్వితీయాంకము.

శ్రీమదుమారమణాయనమః.

# దుర్యోధనాభిమానము.

## తృతీయాంకము.

(అంతటఁ గుంతియు భీముఁడును ప్రవేశింతురు)

కుంతి—బిడ్డా! పిమ్మట నెట్లు ప్రవర్తిలినది?

భీము—అతండు మోచేతులం దూలించిన నేనును మోచేతులన భుజాంతరమ్మునసైన నేను నట్లన యీడుదీయక తూలించితిని. అపుడతనికిం గించిత్తయినను బలుక సందు లేకపోయినది.

కుంతి—ఏనెఱుఁగనా! అనభ్యస్తవిషయమైనను నెదుటివానింగాంచి సుపరిచితునట్లు నటింతువు.

భీము—కర్ణుండట్టె చూచుచుండెను. దుశ్శాసనుండు వికాసవదనుండై కనుఁగొనుచుండెను.

కుంతి—దుశ్శాసనుండు చిఱుతవాఁడు. కాని దుష్కార్యమునైనఁ బెద్దవారు చెప్పినచోఁ దనకుఁ దోఁచినదానికంటె శ్రద్ధగఁ గావించును.

భీము—పిమ్మట నోజననీ! దుర్యోధనుండు కందుకముం గేలఁగొని యిదిలెస్సగ నెగయుటలేదు. వేఱొండు గొనిరమ్మని తమ్మునిబలికెను.

కుంతి—కందుకపరివర్తనంబున నేమైన భేదముండునా యేమి?

భీము—ఏమియునులేదు. దుశ్శాసనుండు రెండవచెండుఁ దెచ్చులోపలఁ గర్ణునితో నేమో మంతనముం జేసెను.

కుంతి—(తనలోఁ గర్ణునుద్దేశించి) తనయా! తెలియక యేమైన నిందింపుమంటివా? తిరిగివచ్చును జూమా. (ప్రకాశముగ) ఓగాంధారి! ప్రచురనామమేనియు విరసముగానుండునని ప్రేమచే దుర్యోధనా యనుటకు నోరాడక సుయోధనా యనినీబిడ్డం బిలుతునే! అట్టిచో నీపుత్రునకు మాపై నింత యసూయ యేలొకో.

భీము—గీ. కలిసమీపించుచుండిన• కతనజనని!, యాత్మబుద్ధిసుఖంబని• యరయలేక
నమ్మి చెప్పుడుమాటలు• నమ్మతించి, చెడఁదలంచెను గాఁబోలుఁ• జిత్తమందు.

కుంతి—కుమార! బంతితెచ్చిన పిదప నేమిజరగినది?

భీము—మేలుమాటగా రాధేయుఁడు "మూఁడుతడవలలో నెవ్వరికైన జయాపజయం బు" లని యుగ్గడించె.

కుంతి—నిజముగా నిది యనర్థమునే తెచ్చును.

భీము—అట్లేయగుంగాక యని మం దేనేదానిం బుచ్చికొని మీఁగాలితోఁ ద్రుళ్ళించితిని.

కుంతి—నీవు విడిచిన బంతి యాతనికిఁ దొరకినదా?

భీము—మొదట దొరకనిచ్చితిం గాని రెండవసారి యెగఁజిమ్మిన నదియెందోపోయినది. ఎల్లవారు నాకనంబునకై తల లెత్తిరి.

కుంతి—అనంతర మేమియయ్యెనో?

భీము—అనంతరమున సుయోధనుఁడు—

చ. ఇఁగఁ బడు నింకఁ గ్రిందఁ బడు నింకఁ బడు న్వహియించి చూతమం
చుఁగడు సభాప్రదేశమునఁ జూడ్కులు వెట్టిరి కొంద ఱింక నెం
దుఁగనఁబడుం గ్రహించినవి తోరపుఁబక్షులటంచుఁ గొందఱుం
డఁగ వెలఁబాటు మోమునఁ గనంబడ నిల్చెను గర్ణుఁ జూచుచున్.

కుంతి—ఆ మొనగాఁ డేమి చేసినాఁడు?

భీము—ఏమియున్నది. నలువురితోఁ దానును గందుకాన్వేషణమునకై యొకవంకకుఁ బోయెను. వారెవ్వరును మరలిరాక మున్నుగ తాఁకవలదు, పోనిండు, చండాలవాటికలోఁబడిననే కూడదు, చర్మకుండమునం బడినదియేల? మహారాజుల కిట్టివి వేనవేలుండునని యొక్కయాలివు వినవచ్చినది.

కుంతి—అది సుయోధనుండు వినియెనా?

భీము—వినుటయే కాదు—పిమ్మటఁ దనపాండిత్యమంతయు వినియోగించి నన్నుద్దేశించి "యోరోరి! పాండవ! చెండును జండాలవాటికలోని కుండులోఁబడవైచి నీకుండత్వమును వెల్లడించుకొంటివిరా!" యని శబ్దాలంకారముగాఁ బలికెను.

కుంతి—నీవేమైన సమాధానముం జెప్పితివా? (తనలో) వారిట్టివారని యెఱుఁగఁడా?

భీము—మాటకుమాట యొప్పఁజెప్పకుందునా! వారిలోపములు వెదుకవలయునా!

కుంతి—తండ్రీ! యేమంటివి?

భీము—ఓరోరి! నీగోళకపాండిత్యముం గట్టిపెట్టుమంటిని.

కుంతి—ఆయభిమానశాలి పిదపమాటలాడెనా?

భీము—ఇంక నెక్కడిమాట—



గీ. వాయి తెఱచియుఁ బలుకఁడు•ప్రస్ఫుటాక్షుఁ
డయ్యుఁ జూడఁడు నాయన్న•యట్టిమాట
బెడిదముగఁ జెవులు నిండిన•వినఁడు నొకటి
నిలిచెనిర్జీవపుత్త్రిక•వలె నతండు.

కుంతి—ఇపుడుకర్ణుఁ డుండిన నేమగునో !

భీము—ఏమగునో గాని యించుకవడి నిలుపంబడి యట్టె మీఁదికిఁ దలయెత్తి యాలోచించి, 'ఛీ, మానహీనురాలా ! ఇదె నిన్ను ఖండింతు' నని తల్లిపైఁ గాతాళం బెత్తి పరుగుపరుగున బంతియాట సంగతి నాతో నేమియుఁ జెప్పకయే యరిగెను.

కుంతి—(తనలో) సంతానహీనులు చెట్టులకుఁ జేమలకు మ్రొక్కి సంతతి వడయుచుండ మునివరప్రసాదమునఁ గొడుకులం గన్న యేను దోషురాలనా ! (ప్రకాశముగ) తండ్రీ ! అతఁడు తల్లియొద్దికేగి యేమిచేయునో విచారింతము రమ్ము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

(కన్నుల వాసినకట్టుతో గాంధారియుఁ గత్తితో దుర్యోధనుఁడును బ్రవేశింతురు.)

దుర్యో—(తల్లియెదుటఁ గత్తిపట్టి కోపముతో నిలుచును)

గాంధా—తండ్రీ! నీకీకర్ణుఁ డెక్కడ దొరకినాఁడు. నీచదివిన దంతయు నేమాలఁబడినది. ఒకరికిఁ జెప్పఁదగినవాఁడవు నీవొరులమాటలు విని చెడుచుంటివా !

దుర్యో—హీనవాక్యములతో మఱింత క్రుద్ధుం జేయకుము. ఆమాటంకమే లేకపోయిన నీవిప్పటికి సగము దూరము పోయియుందువు.

గాం—కొడుకుల చేతిలోఁ జనువారు మావంటి నిర్భాగ్యులు గారు.

దుర్యో—(కోపముతో)

ఉ. సంతతి గోరి చెట్టులకుఁ•జట్టులకుం బడి మ్రొక్కి పుత్త్రులం
గాంతురు వింతయేమి ! ముని•కాంతువరంబున దేవదత్తులా
కుంతికిఁ బుట్టి రిట్టిది త•గున్నె నువంటి వితంతు వేధరా
శాంతుని బెండ్లియాడి కుల•కల్మషకారణ యయ్యెఁ జెప్పుమా ?

గాంధా—పుత్త్రకా ! నీకీవెడఁగుఁదనం బెవ్వరు నేర్పిరి !

దుర్యో—నీవు కర్ణునిపై నసూయకనఁబఱచుచున్న దానవు. అతఁడుండిన కతంబునన నాకీగుట్టంతయు బైలుపడినది. చక్కనిలుము. నిన్నుద్రుంచి కుల మకలంకము చేసెదను. (అని కత్తి చేతితోఁ దుడుచుచున్నాఁడు.)

గాంధా—బిడ్డా! మొనటిది శాపప్రతిషేధమునకై యొనర్పఁబడినది గాని నిక్క

పెండ్లి కాదు.

దుర్యో—(ఆలోచనతో) శాపమా! ఎవ్వరికి?

గాం—అట్లు జగుము. పూర్వాపరంబు లరయమి యవివేకము.

దుర్యో—అవివేకమో సువివేకమో యభిమాని యిది విని సహింపఁడు.

గాం—నామాటలు విని సహింపకున్న నెట్లయినఁ గావింపుము.

దుర్యో—ఇష్టము లేనివి వినినను మదికెక్కవు.

గాం—సత్యాసత్యములను విచారించు తలంపు లేక వినినంతనె తనవాదమున కేమిభంగము వచ్చునో యను భయముగల దుర్విదుష్టివిదగ్ధులు గాని రెండుపక్షములును వినక ఘంటాసురశిష్యులు కారు.

దుర్యో—నన్నట్టివారిలోఁ జేర్చితివా? ఎవరిపక్షము వారు నిల్పుకొను యుక్తులు చెప్ప టలోకములో నున్నదియే కదా!

గాం—వినువారు మూర్ఖులైనచో నట్టి కువాదము స్థిరపడును.

దుర్యో—అట్లయిన నేదీ నీవాదమును విందును, జెప్పుము.

గాం—ఒకమహాత్ముఁడు నన్ను బాల్యమునం గాంచి యీమెం బెండ్లియాడినాతఁడు మృతుండగునని వచించెను.

దుర్యో—మరలఁ బెండ్లి చేసికొనుమనియుఁ జెప్పినాఁడా?

గాం—సాంతముగ నాలకింపవేమి?

దుర్యో—ఉన్నకొలఁది నాకుఁ గ్రోధ మధిక మగుచున్నది.

గాం—ఇది యితరులవాదము విన నిష్టములేకపోవుట కాక యేమిటి?

దుర్యో—చెప్పుము. చెప్పుము.

గాం—అకారణమున నాతండ్రి మిగుల వగచి యమంగళపరిహారమునకై నన్నొక మగమేఁకకుఁ గట్టిపెట్టి దానిం దునిమించెను.

దుర్యో—నీ. శాపఫలము గనుంగొనఁ నోపికొన్ని, దినము లా మేఁకనుంపక తెవ్వనేని నంత నేశాపమే గనేఁ యుచియె సత్య, మైన మృతిఁ బొందదె తనంతఁ దానె వేగ.

గాం—అంతటితో నాజనకుని సంశయము తీఱినదా! లేదు.

దుర్యో—మేఁకకుఁ బ్రతిగా నీకంఠముం దునిమినఁ దీఱిపోయియుండును.

గాం—ఇట్టిసంపలకు నోఁచిన నాకట్టి మరణమేల కలుగును!

దుర్యో—ఆమహాబుద్ధిశాలయగు నీతండ్రి సంశయ మెట్లు తీఱినది?

గాం—భీష్ముండు మాతండ్రికై నన్నడిగినపుడు నాసుమంగలీత్వమునకుఁ గా నిందొకతె

దైనఁ బలిని రక్షింపఁజాలినది యుండదా యని నా చెల్లెండ్రను బదుండ్రఁ గూడ నాతో నీజనకునకిచ్చెను.

దుర్యో—అక్కటా! మఱికొందఱికినిఁ గష్టము తెచ్చిపెట్టినాఁడే!

క. నినుఁ బెండ్లి యాడునాతఁడు, చనునని ముని చెప్పినపుడె చాలింపక యి
చ్చెనె నీతోఁ బుట్టులనుం, బెనుదుఃఖాంబుధి మునింగి విధవలు గాఁగన్.

గాం—ఆతఁడెట్లాలోచించెనో యట్లె యింతకాలమీరీతి నున్నారము గదా!

దుర్యో—మావారిది యెఱిఁగియే నిన్ను సమ్మతించిరా?

గాం—నాకుఁ దక్క నా చెల్లెండ్రకే తెలియని విషయము వారికిఁ దెలిసి యుండునని చెప్పఁజాలను.

దుర్యో—ఛీ, సుబలరాజంత దరిద్రుఁడా?

గీ. కులములో వన్నె చెడునని • కొంకులేక, శాస్త్ర మొప్పదటంచను • జంకులేక
ఛల మొనర్చినఁ బాపమ • న్నంకలేక, వెట్టిపనిఁ జేసె నీతండ్రి • విత్తకాంక్ష.

గాం—వెట్టిపనియో గడుసుపనియో మేమిట్లుండుటకుఁ గారణమైనదిగదా!

దుర్యో—ఇట్లున్నవారమను సంతసమేనా యవమానముం బొందుచుంటి మను సిగ్గైనఁ గలదా?

గాం—మొదటివివాహము మనుష్యునితోనైన సిగ్గుపడవలసినదే.

దుర్యో—పశుభార్యకు నీవు సిగ్గెక్కడిది.

గాం—స్వాతంత్ర్యములేని విషయములో నన్నేలనిందించెదవు.

దుర్యో—నిందించుటతోఁ గుదిరెనా ఖండించెదను.

గాం—ఖండింతు ఖండింతునని బెదరింపనేల. కన్నులు మూసికొనియున్న నన్నప్పుడే మడియింపక పోయితివా! నీయట్టి కష్టాత్మునికిఁ దల్లినగుటనే నాకిట్టి యవమానము సంభవించినది.

దుర్యో—ఇంతటిఘనకార్యమును స్వతంత్రించి చేసినవాఁ డెవ్వఁడు?

గాం—నాతండ్రి సుబలరాజు.

దుర్యో—మావంశమును బుద్ధిపూర్వకముగాఁ జెఱుపఁదలంచిన యాక్రూరుని ముందుఁ గాఁ జంపెదను.

గాం—మాతండ్రి చేసినది క్రూరకార్యమును నీవు చేయఁబోవునది యక్రూరకార్యమునా. వేగముగ నాచరింపుము.

దుర్యో—అంతటితో నూరకుందునా?

గాం—అంతకునుమించిన నీవుచేయఁబోవు ఘనకార్యమేది ?

దుర్యో—ఇట్టియలజడిం దెచ్చిపెట్టిన భీమునిగూడఁ దెగటార్చెదను.

గాం—కర్ణునేల చంపవు ? భీముఁడా కర్ణుఁడా దీనికిఁ గారకుఁడు.

దుర్యో—(ఆలోచించి) ఎవ్వరును గారు, నీతండ్రియే ముఖ్యకారకుఁడు. నన్నేల పెక్కిరించెదవు. ఇదిగో వానిపైఁ బోవుచున్నాఁడను. (అని వేగముగ నరుగును)

గాం—ఈతనిజనించిననాఁడె దోసంగులు పొసంగును గాన విడిచిపెట్టుమని పెద్దలుచెప్పినను విననిఫలం బింకమమ్ముఁ గట్టికుడుపును. ఇట్టివానియొద్దఁ జేరినవాఁడు కర్ణుఁడు. అడుగనేల! పట్టినపట్టువిడుచుస్వభావము వీనిబాల్యమునుండియుఁ గానము. వీనిగర్వభంగ మెప్పటికైననాసహోదరులే చేయఁగలరు.

(అంతట భానుమతి పనికత్తె ప్రవేశించి)

ఎన్నిచెప్పినను వినక నేఁటికిఁ బయనము మానుమనినను మానక యాగ్రహముతోఁ గౌఁగిలివ్విడిపించుకొని పోయిన దుర్యోధనమహారాజు వార్త చెప్పుటకై వచ్చుటకే కాఁబోలును భానుమతీదేవి "మురళా! అత్తగారేమిచేయుచున్నారో చూచిర" మ్మని యాజ్ఞాపించినది. అట్టెయాలస్యముకాకుండ గాంధారీదేవిగారిక్కడనే కనఁబడినారు. (అనిసమీపించి) అమ్మా! రాజమాత! ఏనుమురళను.

గాం—ఏమే! కోడలేమిచేయుచున్నది ?

ముర—అత్తగారేమిచేయుచున్నారో చూచిరమ్మని నాకు ముదలయిడి సౌధోపరితలంబునుండి సుబలపురము దారిచూచుచు నెద్దియో యాలోచించుచున్నవారు.

గాం—ఏనును నీవలెనే యాలోచించుచున్నదానవని చెప్పుము. నన్నునాశయనగృహమునకుఁ గొనిపొమ్ము.

ముర—చిత్తము. (అనియిరువురు నిష్క్రమింతురు.)

(అంతట దుర్యోధనుఁడు ప్రవేశము)

దుర్యో—(ప్రవేశించి) పలువురుతలఁచినట్లు కర్ణుని నిందింప వలనుగాదు. వానిలేనియపుడు భీమునట్లుపలుకుట నాతప్పు. దుశ్శాసనుఁడు చెప్పుచునేయున్నాఁడు.

గీ. ఒకరిననేల పడనేల యూరకుండ, గౌరవంబని బల్మిని బోరుచుండెఁ
దగదె బాలాదపిసుభాషితమ్మటనఁగఁ, గదపినను గండిరీఁగలు కదుపుగాదె.

తీఁగకదపినడొంకయంతయుఁగదలును. ఇపుడు నాకెన్నియోలోపములు కనఁబడుచున్నవి.

మ. తనకన్యాత్వమునంద సత్యవతి వైధవ్యంబునందామె నే
ర్పినఁ గోడండ్రను నీతిమాలిరి బలారే వారిమెప్పించి మా
ర్గమునుముం గొన్నది వారికోడలగునస్మన్మాత పితాజ్ఞ చే

సమసెంబో కలికాలసంధినె కులాచారంబు మండెట్లొకో!

ఏను నాతల్లిని ఖండించి యుంటినా మున్ముందు భయంబు కతన నోరులలో నిట్టి యాసత్కార్య మొనర్చుటకెడము లేకుండును. ప్రజలెల్లరు బెదరుచుందురు. ఇస్సీ! ఇంక నాప్రభుత్వ మెట్లుండునో! ఇంట గెలువఁజాలనిది రచ్చ గెలుచునా! తల్లినిఁబ్రాణపాయముగఁ ద్రుంచుట రాజామదగ్న్యునకే చెల్లినది. ముందా పని జరపి యిక్కడకు రావలసినది. (ఆకర్ణించి) సరిసరి! యిది యొకటియా!

చ. ఒలసినభక్తి భర్తపయి నుంచుట కన్నులపట్టమేర్పడం
దెలుపుమనుండె; మానమునుస్త్రీత్వము నాబిడసొమ్ము లట్టిచోఁ
బలుచనివారలున్ ద్రవిణవాంఛితులు న్విషయాభిలాషిణుల్
తలపడి యాచరించుటకధర్మమునుం దెగి చేసెనేకటా!

అట్టితల్లిని మడియింపక యిఁక నడవిలో ముక్కు మూసికొని కూర్చున్న ముసలిరాజునా యిప్పుడు చంపఁబోవునది. ఇది యకృత్యము. కృతపడినదానికై యింతయేల. అక్కడనెంతో యిక్కడనంతియు యని తిరిగిపోవుదునా! (ఆలోచనతో) నాపౌరుషము మొక్కవోదా. (మీఁదికిఁజూచి) ఇది బాగని నాకుఁ దోఁచుచున్నది. కులము చెఱచిన తల్లిం జంపఁ జాలని నావలెనే తోడఁబుట్టినదానికిఁ బునర్వివాహము గావించిన తండ్రిం జక్కాడని నామేనమామల నేమందును! ఈయవసరమున నాకు మేనమామపోలికలు వచ్చినవి. మనుజులకుఁ బుత్త్రులచేతులలోనో దౌహిత్రుల చేతులలోనో యుత్తమగతి కలుగును గనుక యీసుబలరాజునకు మేమిరువురమును గారకులమగుదుము. ఎట్లన:—ఏమారయో పాయంబుననో నామాతులులం జంపితినా పుత్రశోకమున నాతండు త్రెళ్ళును. బలె! యిది తగినయుపాయము. ఎవ్వరికిని నాహృదయము తెలియకుండ సంచరించుచుఁ గార్యము నిర్వహింపవలయును. (ఎదుటికినడచి చూచి) సుబలపురమే ప్రవేశించితినే! (అని నిష్క్రమించును.)

కర్ణు—(ప్రవేశించి) ఎవ్వరైననేమి. చెప్పినదాని నౌచిత్య మెఱిఁగి నిర్వహింపవలయును. ఇది నావెఱ్ఱిగాని యింతకు నాతని నేనేమనుమంటిని! అభిభవించుటకిట్టిమార్గములనేకములున్నవనికనఁబఱచితినిగాని నీవేపలుకుమని స్పష్టపఱపలేదే. ఆమాట నేననవలసినది. భానుమతి తెల్పకుండిన నాకీగొడవయే తెలియకపోవును. తమ్ముఁడైన వెంటఁ జనలేదే పిలువకుండ నేనెట్లు పోవుదును. సుబలరాజింతకుమున్నె తపంబునకేఁగనని వింటిమి. అతనిం జూచినపుడైన క్రోధోపశమనము గాఁగూడదా! ఏమె చూతము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

ఇతి తృతీయాంకము.

శ్రీమదుమారమణాయనమః.

# దుర్యోధనాభిమానము.

## చతుర్థాంకము.

(అంతట మణిమాలయను బ్రాహ్మణస్త్రీ ప్రవేశించుచున్నది)

మణి—(ప్రవేశించి) నాపాలిటికి దేవతాసమానయగు నాయత్తగారికి నమస్కారము. ఏలయంటిరా! అత్త చాటుదాననైనను నన్నుఁ బదిమంది యౌవనపురుషులఁ గనుఁగొనుట కనుపగునటుల నేదోపనికల్పించి యీహాస్తినాపురము వీథులవెంబడిఁ దిరుగనిచ్చుచున్నది. కాలుగాలినపిల్లివలె దేశాటనము చేయు బుద్ధిహీనుఁడగు నామగనికొకవేయి వందనములు. ప్రోషితభర్తృకల గతి యేమి కావలెను? ఎవరిసంగతి వారికేఁ జక్కఁగాఁ దెలియదు. కాని నాసంగతి నాకు బాగుగాఁ దెలియును. తిట్టుఁబోతులలోఁ దిరుగుఁబోతులలో నగ్రతాంబూలము నాకు రావలయును. మామగారు జ్యోతిషము నేర్చినారు కాఁబోలును, నేను బుష్యమినో పునర్వసునో ప్రథమమార్తవనైతిననియు నాకారణమునఁ బరపురుషాభిలాషిణి నని యుమాయత్త నాలోఁ దూఱి చూచినట్లే చెప్పును. మీమామగారు బహురసికుఁడని చెప్పి నన్నూఱించుచుండును. దురదృష్టవతిని గాకున్న నేనడుగువెట్టినప్పటికే యాయన నడతురా! ఎంతచెప్పినను మాయత్త బొంకిన ట్లింకను నాకుఁ జేతగాదు. అష్టావక్రసంతతివాఁడగు నామగఁడు ముందెవ్వతె యైన నడచుచుండెనా దానిముఖము చూచుటకై సకిలించువాఁడు. నాకది కొంతపట్టుపడినది. నాయందమునకుఁ దోడు చూచిన పురుషునెల్లఁ బలుకరింపనె మనసు. (నవ్వుచు) ఊఁ ఊఁ మనసుపుట్టుచుండును. నేను జదువుకొన్న చదువులోని యొక్కశ్లోకము జ్ఞాపకమువచ్చుచున్నది.

"శ్లో॥ కృశః కాణః ఖంజః శ్రవణరహితః పుచ్ఛవికలో
వ్రణీపూయక్లిన్నః క్రిమికులశతైరావృతతనుః
క్షుధాక్షామో జీర్ణః పిఠరకకపాలార్పితగళః
శునీ మన్వేతి శ్వా హతమపిచ హంత్యేవమదనః"

బలె! బలె! హతమపిచ హంత్యేవమదనః । ననుహతహననమన్యాయ్యమితి విచారయతి! (నవ్వుచు మాయత్తకు మనస్ఫూర్తియగు మఱియొకనమస్కారము.

ఏమిటికి? గోపవాటిక లోనికేగి యపుడు కాఁచిన నేయి తీసికొని రమ్మని పంపినది కావున. (చూచి) ఇప్పటికే చాల యాలస్యమయినది. దీనికి సమాధానము వెన్న కాఁచుటలో నైనదని బొంకి చెప్పెదను, కాని యా బాణపంజరముపై దిండుదిరుగుచుఁ బరశురామునియొద్ద నేర్చుకొనిన విద్యను సాధకము చేయుచున్న కర్ణునిం గనుఁగొనుచు వానిపై భ్రమకలిగి యొడలు తెలియక నేతిగిన్నె చేఁబూని వచ్చుచు త్రాయి తగిలి బోరగిలఁబడిన నేయి యొలికినది. దీనికేమని బొంకను! ఇంటి కేగునప్పటికే మైన నూహకుదురును. కాని రాధేయుని నాయొద్దికి రప్పించుకొను నుపాయము మాత్ర మింతలోఁ గుదురదు. (మీదికిఁ జూచి) అగుఁగాక! నేఁడింకను జాలఁ బ్రొద్దున్నది. ముందింటికిఁ జని పిదపఁ గర్ణునితో మాటలాడుటకుఁ దగిన యుపాయము చింతించెదను. మాయత్త మిగులఁ జెడ్డది.

(అంతట నామెయత్త డిద్ధ ప్రవేశించుచున్నది.)

డిద్ధ—(ప్రవేశించి) నాలోనామాట, అత్త మంచిదైనం గోడలును మంచిదగును. దాని నేనెట్లు చీవాట్లు పెట్టఁగలను. ఎవరికొడుకు వారికిముద్దు. నాకొడుకు బడిద్ధుఁడు వేదము చదువనీ, కాసిలో ముష్టియెత్తనీ, గంగలో మునుఁగనీ వాని బుద్ధి కుదుటఁబడదు. ఆదేశద్రిమ్మరి పెండ్ల మీకోడలు. ఈయిద్దఱుఁ జేసిన తప్పులను దిద్దుకొని వచ్చుటలో వాదుంప తెగుచున్నది. ఎవ్వరికిని నేను దొరకను. నామగని బ్రతికియుండినన్ని దినములు నానిమిత్తమై యిరుగింటియరఁగుమీఁదఁ బండుకొనఁ బెట్టుదానను ఇట్టి గుణగణసంపన్నను నాకోడలి నాజ్ఞ పెట్టఁగలనా! మాయిల్లు బెల్లము వండిన ప్రాయ్యి. అయినను నేనెన్నింటికని పోదును. నేయి తెమ్మని దీనిని బంపునపుడే పెద్దవీదిని బోవలదని చెప్పియుంటిని. సిగ్గులేనికట్టె పదిమంది కనఁబడుదురని యాదారినే రాకపోకలు చేయును. ఇప్పటికి మరలి వచ్చుచుండెనా యిచట నాకెదురు పడఁగలదు. ఇంతసేపేమి చేయుచున్నదో! (బిగ్గరగా) ఓమాలీ! మాలీ! ఎక్కడనున్నదానవు. నిన్నటిదినము దారిలో నే నెందఱితో మాటలాడలేదు. నీకంటెముందుగా రాలేవఁటే.

కోడలు—(అత్తనుజూచి తనలో) మృత్యువువలె మాయత్త యెదురువచ్చుచున్నది. (ప్రకాశముగ) అత్తా! నీవెక్కడికి?

డిద్ధ—(అదరిపాటుగ) ఏమే! నీకు దారిలో దుర్యోధనుఁడు కనఁబడినాఁడా యంతటివాఁడగు కర్ణుఁడు కనంబడినాఁడా!

కోడలు—(తనలో) ఈమెయుంచనాలకు నేనేమిచెప్పిన బాగుగానుండునో! (ప్రకాశము) అత్తా! నేయి కాఁచి కొలువఁబోయినది. వేఁడిది కొలువవలదు చల్లార్చుమంటిని. ఇందుచే నాలస్యమైనది. (దిక్కులు చూచును.)

డిద్ధ—ఏదీ, నెయ్యి, కమ్మగానున్నదా? పూసకట్టినదా చూడనిమ్ము.

కోడ—(బోరగిలించి గిన్నె చూపును.)

డిద్ధ—అప్పుడే యింతగట్టిగాఁ జేసికొన్నదా? గేదె నేయి కాఁబోలును.

కోడ—అయ్యో! ఆవునెయ్యి. సరి! యింతదూరము పోయి—

డిద్ధ—ఏదీ! లోనఁజూడనిమ్ము. పచ్చగానున్నదేమో.

కోడ—ఇత్తడిగిన్నెలోఁ బచ్చగా నుండకేమి!

డిద్ధ—అయ్యో! నేయియుండఁగా నడుగు కనఁబడునఁటే.

కోడ—నేయి యెక్కడిది! వట్టి గిన్నెయే.

డిద్ధ—నీయమ్మచచ్చిపోను! నేయి తేకుండ దారిలోనే యాడుచున్నదానవా?

కోడ—పట్టుకొనివచ్చుచున్న ట్లెందఱిని సాక్ష్యము పలికింపను?

డిద్ధ—నీకు సాక్షులకుఁ గొదవయేమి. పైకమేది?

కోడ—గొల్లదానికి నేతికిచ్చితిని గాదటమ్మా?

డిద్ధ—మఱి నేయి యెవ్వరి మొగముమీఁదఁ బోసితివి?

కోడ—భూమిదేవి మొగముమీఁద.

డిద్ధ—దిక్కులు చూచుచు వచ్చితివా! నీకెవ్వరైన నడ్డువచ్చినారా?

కోడ—(తనలో) నాకార్యమీమె మాటలచేతనే సానుకూలమగునట్లున్నది. (ప్రకాశముగ) కర్ణుఁ డడ్డువచ్చినాఁడు. (అని నోరు మూసికొనును)

డిద్ధ—(కోపము) ఓరోరి నీచుఁడా! నీకెంత రాజావరము కలిగియున్నను మేమెంత చెడిపోయినవాండ్రమైనను నీయాటలు మాబ్రాహ్మణులదగ్గఱ సాగవు. ఇంకను గలిప్రవేశింపలేదు. ధృతరాష్ట్రమహారాజుగారితో మనవిచేసి నిన్నేమి చేయించెదనో చూడుము. నానెయ్యినాకిమ్ము లేదా దానివెలని-(ఆలకించి) గోడదెబ్బ చెంపదెబ్బ మాకేనా! మాసరకుఁ బోయినదిగాక పైఁగా మాకు మీవలనఁ జీవాట్లా! (విని) ఆఁ! అంగరాజైన నాకేమిభయము. నాపైక మైనఁ బాఱవేయఁడా!

(తెరలో)

ఓపౌరులార! ఈవార్త యెవ్వరివలననో విని కర్ణుఁ డీవంకకే వచ్చుచున్నాఁడు. ఆబ్రాహ్మణస్త్రీని నోరు సఁదుకొమ్మని చెప్పుఁడు.

అత్త } రాణీ భయమేమి ?
కోడ }

డిద్ధ—కర్ణుని గుర్తెఱుఁగుదువంటే ?

కోడ—గిన్నాఁడు నేతినోలుకఁబోసినవాని నింతలో మఱతునా ? (తనలో) కర్ణునిదర్శనమైన దొరకును రానిమ్ము. నామగనికిఁ గుట్టుపోగులైనలేవు, చింకిగుడ్డయైనఁ గట్టుకొనలేదు. ఇతనికి సహజకుండలములుఁ గవచముంగలవఁట. ఎంతచక్కనివాఁడమ్మా.

కర్ణ—(ప్రవేశించితనిలో) ఒక్కొక్కని జన్మకాలమహిమ కాకున్న నేమిటి ?

మ. కురునాథాత్మజుకూర్చె నెచ్చెలికినాఁకున్విప్రశాపంబులుం
గురునింపల్పరివాదముత్స్వరసె లోకుల్గాకుశేమందున
ద్దిర ! నన్నాఁడుది తిట్టుకాలమును బ్రాప్తించెన్విచిత్రంబుగా
నరుఁడొక్కండు దలంపదైవముతదన్యంబుం దలంచుంగదా !

ఆబ్రాహ్మణవిధవ యిక్కడనున్నదో ! ఆమెకేనేమి యుగ్గుచేసితినో కనుఁగొనెదన.

డిద్ధ—(ఎదురుగావచ్చి) ఓరోరి రాధేయ ! నీగౌరవము వెల్లడియగు దినములువచ్చినవి జాగ్రత్త !

కర్ణ—(చూచి యామెమాటలువిని) ఓహో ! ఎవ్వరో యపూర్వస్త్రీగాని—సౌమ్యత యే లోకమునను గనఁబడదు. (ప్రకాశముగ) ఓయమ్మ ! ఏనేమి యపరాధముఁ జేసితిని ?

కోడ—(తనలో) అద్దిరా ! ఇతఁడు ధర్మరాజునుబోలియున్నవాఁడు. నావంకఁ జూడనైనఁజూడకున్నవాఁడు.

డిద్ధ—నీవేనా కర్ణుఁడవు ? నాయెదుట నీబెట్టుసరి విడువుము. నీవేమి చేసినదియుఁ జెప్పెదను. ఇంతలోనే మఱచితివిగా !

కర్ణ—వనితామణి ! అది కలిగినఁజేకదా !

గీ. దాత యర్థి కిడినదానిని మఱచుఁ గృ, తఘ్నుఁ డొనరఁ గొనినదాని మఱచుఁ
జెనఁటి సుందరాంగిఁగని వావి మఱచును, మఱచు నెగ్గొనర్చి మందబుద్ధి.

కోడ—నీప్రసంగము చేసెనో యీతేజశ్శాలిని గొంతసేపు నాయెదుట మాయత్త నిలిపినవాకుఁ జాలును.

డిద్ధ—(కోపముతో) జ్ఞప్తికివచ్చునట్లు చేసెదను. బ్రాహ్మణులను గౌరవమైన లేదా!

కర్ణ—ఆతారతమ్యహీనుఁడగు పాపి యెవ్వఁడో !

డిద్ధ—నీవుగాక యొరు లెవ్వరు ?

కర్ణ—మీకు నేనొనర్చిన యుపకారమును దానికిఁ బ్రాయశ్చిత్తమును నీవే చెప్పుము.

డిద్ధ—పెద్దపేరు పెట్టుకొన్నవాని యిల్లాలనై యంతమాత్రముం జెప్పలేనా !

కోడ—(తనలో) నిజము గ్రహించి నేరము నాపైఁ బెట్టఁజాలదు గద ! అమాత్రము తెలివితేటలా !

కర్ణ—ఓబ్రాహ్మణి ! వేగమున నను నిర్దోషిం జేయుము.

డిద్ధ—యాచకుఁడవు గావుగదా నీసాములు చట్టుబండలు రాజమార్గమున నేల పెట్టితివి ?

కర్ణ—దానివలన మీకేమైన నష్టకలిగినదా ! అట్లయిన నాశ్చర్యమే !

ఉ. ఏసినయమ్ము తప్పి చన•నిచ్చెను శాప మొకండు మేలుగాఁ
జేసినసాధకంబు వృథ• చేసె నొకం డెటులెంత గ్రుచ్చినం
గోసినహాని చేయ వివి•గోమదధీనము లస్త్రశస్త్రముల్
(అని ధనుర్బాణములు చూపించి)
దోసము నాకుఁ గట్టునె వ•ధూవధమూం బొనరించి యక్కటా !

డిద్ధ—ఆవెఱ్ఱివా రిచ్చినశాపములు పురుషులను బాధింపనీయవు గాని యాఁడువారిని బాధింపనీయవా ?

కర్ణ—హరహర ! నా బాణము లేవారికి నపకృతి చేయవు.

కోడ—(తనలో) నీబాణములు కావుగాని మన్మథ బాణములు నాకపకృతి చేయుచున్నవి.

డిద్ధ—నీతో నే నట్టె మాటలాడను. నా నేయిగాని దానికైన రొక్కముగాని యచటఁ బెట్టి తొలఁగిచనుము.

కర్ణ—(ఆశ్చర్యముతో) నేయియేమి ? రొక్కమేమి ?

కోడ—(తనలో) పాప మీతఁడా గొడవయే యెఱుఁగఁడు.

డిద్ధ—నాకోడలి కడ్డువచ్చి గిన్నెలోని నేయి యొలుకఁబోయలేదా ?

కోడ—(తనలో) ఈతనిం గాంచి నేనొలుకఁబోసికొంటిని.

కర్ణ—శివశివ ! నాకెంతటి యపవాదము సంభవించినది ! ఓయింతీ !

గీ. కలరు కొందఱు దౌర్భాగ్యు•లిలను దమకు, వనిత యొంటిగఁ గనఁబడ•నలిమిసేయు
వార ! లారీతిగాఁ దన•భార్యనొరులు, పఱతురను బుద్ధి చాలని•మొఱకువాండ్రు.

కోడ—(తనలో) ఈతఁడు నామగనిచరిత్ర మెఱుఁగునా యేమి యిట్లు చెప్పుచున్నాఁడు

డిద్ధ—(కోడలితో) ఏమే, నేయి యెట్లొలికినదో చెప్పవేమి.

కోడ—(ఆలోచించి) బాణపంజరము పై బెండుతిరుగు నీయనం గాంచుచు నడచు నా

కాలికొక రాయి తగిలి బోరగిలం బడితిని. గిన్నెలోని నేయి —

కర్ణ—(తనలో) ఇక్కాలమునఁ గలియు ద్వాపరమును మనుష్యులై పుట్టెదరను వదంతి యున్నది. వారివురే కాఁబగద వీరు. (ప్రకాశము) ఇదియేనా నావలన మీకుఁ బొడమిన యెగ్గు?

సిద్ధ—ఇది యేమి నీ ప్రాణమునకు స్వల్పముగా నగపడుచున్నదా?

కర్ణ—ఆహా! బ్రాహ్మణివి, ఇన్నిట్లాడుట నీకుఁ దగినదేనా? జరిగిన దొక్కటియు నీవు చెప్పినది యొకటియు నా!

సిద్ధ—ఏవేళకు రాకున్న నాకోడలిమూలమున నొడలు మండినది.

కర్ణ—పరుషభాషణములుమాని నేయియిమ్మన్న నిచ్చెదువాఁడనుగదా?

కోడ—(తనలో) దానకర్ణుఁడవు. ఇట్టివాఁడవు నాకొక్క కౌఁగిలియీరాదా?

సిద్ధ—నామేను పేయుది. నా నెయ్యి నాకిచ్చిన నీగొడవ వదలిపోవును.

కర్ణ—నిరాపనింద తొల్లువచ్చునో! రారండు, నాతో రండు—

సిద్ధ—పెద్దచిట్టెడు నేయి. మేము పదిమంది సొంతము. అందఱికి గిన్నె చూపించి నెల వాడుకొందును.

కర్ణ—రారండు. మీ నేయి మీకిచ్చెదను. (తనలో) ఆహా! దుష్టాత్ము లిట్లే యొకదాని కొక్కటి కల్పించుచుందురు!

(అని యాస్త్రీలతో బరిక్రమించుచు.)

అత్త, కోడ } (ఆజ్యపూర్ణమగు పాత్రముతో వచ్చుచున్నారు)

అత్త—ఓసీ నీకును నీమగనికిని బుద్ధివచ్చుట యెప్పుడో. మీరొనర్చినవానిం దిద్దుకొని వచ్చుటలో వాపని తీరుచున్నది. ఇంకను నయము— అతఁడు బలవంతుఁడు గావున నాలికివచోటి మట్టిపెళ్ల బాణముతో మీఁదికెత్తి పిండియిచ్చినాఁడు, మఱియొకఁడైన రొక్కము నేయి రెండును దండుగ యేనా—

కోడ—దిక్కుమాలిన బుద్ధి, యిన్నేండ్లు వచ్చి మాకుఁ బుద్ధివచ్చుటయేమిటి. మేము కుదుటఁబడినపుడే. ఇంక నిక్కడ నాలస్యమేల? ఇంటికిఁ బోవుదము.

(తెరలో)

ఓరోరి కష్టాత్ముఁడ! అడఁగఁ ద్రొక్కినకొలఁదిఁ జెండువలె నీగర్వమంతయు శాపములచే దిగఁదీసినను దూలిపడుచున్నాఁడవు. ఎంతో యాసతో రసగ్రహణలోలులై యాకులటకు బుద్ధిచెప్పుటకై యొలుకఁబోసిన నన్ను నీవుపిండి యిచ్చితివి శా

వున వన్నెంతలోఁతు త్రవ్వితివో యంతలోఁతు నీరథచక్రము ఘోరయుద్ధములోఁ గ్రుంగును గాక !

అత్త—(విని) ఓసీ! ఇదియేమే! కర్ణునే యంతకోపముతోఁ బల్కిన భూమిదేవిమనల నేమిచేయునో. చల్లఁగాఁ బోవుదము రావే- రావే- తొత్తుకూఁతుర ! నీమూలమున నాకొంపకేమిమూఁడనున్నదో—(అని నిష్క్రమించును.)

కర్ణ—(ప్రవేశించి) ఓపరమేశ్వరా ! నేనేపాపపువేళజన్మించితినో కాని నాపైనిందతికి నింతచలమేమొకో ! దుర్యోధనుం డూరలేఁడు. ఆతండక్కడ నేమిచేయుచున్నాఁడో యనుదిగులు మిగులుచుండఁ నడుమనాకొక నెగులు సంప్రాప్తమైనది. ఏమిచేయుదును. నిన్నటినుండియు రాజమందిరమునందలి వార్తలు వినుటలేదు. సుబలపురవిశేషము లేమైనఁ దెలిసినవేమో విచారింపవలయును. (నడచిచూచి) ఏమీ! రాజమార్గమున నాకలకలము !

క. తిన్ననిపిఁడినరంగులఁ, దిన్నెలఁ గూర్చున్నఁ జనులు దిగదరదపుతోఁ
డన్నిలుతు రిరుగెలంకుల, సన్నిధివిసుచుగతి మ్రొక్కి సమధికభక్తిన్.

దీనికిఁ గారణమేమైయుండవచ్చును. ధృతరాష్ట్రుం బొడఁగాంచుటకై మునీంద్రు లెవ్వరైన ద్వైతవనమువారు లేక కామ్యకవనవాసులు వచ్చుచున్నారా,— తాతగారియూరినుండి దుర్యోధనుఁడుమరలివచ్చుచున్నాఁడా—(ముందువంక నడచిచూచి) ఓహో ! నారదపురస్సరులైన మునివర్యులే ! ఇపుడు వారిం గలసికొందును. (పరిక్రమించును.)

నారదుఁడు—(ప్రవేశించి) పెద్దలు భవిష్యత్కాలవేదులు. వేదాక్షరములవంటివారి మాటలు విననివారు చిక్కువడుట వింతకాదు. ఈమానులు చర్వితచర్వణముగాఁ జెప్పవచ్చిరిగాని తండ్రిగాని తనయుఁడు గాని వినునట్లు నాకుఁ దోఁపదు.

కర్ణ—(ప్రవేశించి) నారదమునీంద్రా ! కర్ణుఁడు నమస్కరించుచున్నాఁడు. (అని నమస్కరించుచున్నవాఁడు.)

నార—(చూచి) ఓహో కర్ణుఁడా ! పిమ్మట నడచిన వార్తలేమైనవింటివా ?

కర్ణ—మానివర్య ! పూజ్యపాదులవలన వినఁగోరియే యిటువచ్చితిని.

నార—ఎఱుఁగనే యెఱుఁగవా ?

కర్ణ—చర్మదృక్కులకుఁ బరోక్షజ్ఞానముండునా!

నార—అట్లయిన నాలకింపుము.

మ. సుబలాధీశ్వరుఁ డగ్రపుత్రకు మహీశుంజేసి నిర్లిప్తుఁడై
నిబిడారణ్యనివాసుం జలుపమౌనిశ్రేష్ఠులం బిల్వఁబం
ప బహూకారము సేయు వారు బహువిప్రశ్రేణితోఁ బోనవే
డబ మొప్పన్విని యేను వెంటఁ జనినాఁడం జూడ నచ్చోటికిన్.

కర్ణ—ఇంక నేను కృతార్థుఁడను.

శా. ఏమౌలం ద్రిజగంబులో నెచట నేయే కార్యముల్ సాగనో
యామూలాగ్రముగా వచించెదరు మీరచ్చోటలేకున్న నిం
కేమీ చెప్పఁగలేరె మీ యెదుటివారే మేని గావింప ; మా
భూమీశాత్మజు చేఁత లెల్ల వివరింపుండో మునిశ్రేష్ఠమా !

నార—కర్ణా !

క. మానక శాల్వుఁడఁ బఱచెను, వానిం గలసికొన నంపె వరరథ మొకఁడా
భానుమతి యుంతవఱకుం, దీని నెఱుంగుదువెకా మదిన్నమ్మను నీవున్.

కర్ణ—(చేతులు మొగిడ్చి) ఎఱుంగుదు.

నార—పిమ్మట మాతామహు నకుసాధ్వి మీ రాజు పదులకింతయుఁ దనయభిప్రాయం బు వెలిపుచ్చకుండ నెవ్వరికి ననుమానరహితముగు గతిఁ గొన్నినాళ్లు మామలం గలసి యుండెను.

కర్ణ—పైలు దేఱినప్పటి యుద్రేకము రథ మెక్కఁగనే కొంత తగ్గుచు. మామలంగూడి యా దువపురు చాలపఱకు సన్నగిలు నని తలంచెదను. ఏమో! యతని యూహా లెవ్వరికి ని దెలియవు.

నార—నిన్నటిమాపు వినోదాగారమున దక్షిణదిశను దన మేనమామలు—

ఉ. నూఱుగు రన్నదమ్ములును నున్నని తెమ్మెర లేచి వీచుచోఁ
బాఱఁగనిద్ర వారికడఁ బండినవాఁడును బోలె యుండి వే
మాఱును బున్నకొట్టినవలిమంబును డిగ్గి శితాసిఁ గొంచుఁదాఁ
దీఱిచివైచుచుండె నెడఁద్రెవ్వకయందఱ నొక్కరొక్కరిన్.

కర్ణ—శివశివ! కోపము రెండురెట్లు తగ్గినదని తలంచుచుండ నూరురెట్లధికమైనది గదా! ఒకముసలివానిం జంపవచ్చి నూర్గురం గెడపినాఁడు. సంఘమరణము!

నార—కడపటికతని తప్ప నందఱు మడిసిరి.

కర్ణ—వంశమున నొక్కని విడిచినాఁడా! యోగీంద్ర! దానికి గతంబేమి ?

నార—ఆతని మునుమునం బడినవాఁడు బ్రతుకుట కష్టమే కాని యాయుశ్శేషమున నిరు

పదియుప్పదిమంది మిగిలినయపుడు మెలఁకువవచ్చి యల్లుఁడు చేయుదుష్కార్యముం
గాంచి వెఱఁగంది వానికిఁ దెలియకుండ సన్నసన్నగ లేచి తండ్రియొద్దికిఁ బోయెను.

కర్ణ—తపోధన! దుర్యోధనుండంతటి యకృత్యముంజేసి పిమ్మట నెందేగెనో.

నార—రథంబెక్కి యిక్కడికే వచ్చినాఁడు.

కర్ణ—ఎప్పుడు? ఏనుదలంచినట్లు మునులు దుర్యోధనుఁడును గూడ వచ్చిరి. ఈవచ్చిన మునులు సుబలునియొద్ది నుండియేనా!

నార—అగును—ధృతరాష్ట్రునితో.

క. మున్నీతనిపుట్టుకయపు, డెన్నియుఁ గీడులొదవ నెఱిఁగింపమె మీ
నిన్నీవువిడుము పెక్కురఁ, గన్నాఁడవు సుతుల నని ప్రకాస్తిగ ననుచున్.

మరల నిపుడును బోధింపవచ్చియున్నాము.

కర్ణ—మానిపతనము!

సీ. నిన్నుఁబలికినట్టు లెన్నకమన్నించి, వినుము మానుతెల్ల విశ్వవేత్త
అయ్యు నెఱుఁగఁజాల రాత్మజాలను బాయుం, వానివంతయింత పట్టటంచు.

నార—విననేరనివారలకుఁ బలుమాఱు చెప్పుట యాయాసకారణము.

కర్ణ—అటమీఁదివృత్తాంతంబెట్లు చెల్లెనో యానతీఁ గోరెదను.

నార—ఇపుడిక్కడ నడచు రాజస్థానవార్త ముందువిచారింపవలయును. కావున నీవుఁగూడ రమ్ము. పిమ్మట నేమిజరగినదియు శకునివలన విందువుగాక.

కర్ణ—(తనలో) ఇదియంతయు నలజడికేవచ్చినది. చెప్పినదానిని సరిగ నడపిన నింతరాదు. (ప్రకాశము) దేవ! ఆజ్ఞ కావింతము.

(ఇరువురును నిష్క్రమింతురు)

ఇదిచతుర్థాంకము.



శ్రీమదుమారమణాయనమః.

# దుర్యోధనాభిమానము.

## పంచమాంకము.

(అంతట ద్వాపరమును గలియును బ్రవేశించుచున్నారు.)

ద్వాప—(ప్రవేశించి) ఇంకను గలిరాఁడేమి! వచ్చినదాఁక నిక్కడఁ గూరుచుండుమని చెప్పినవాఁ డేల యనలెనో!

క. జవముడిగి లావుచెడి కడు, నవిసితి నవకంబు వోయెఁ బ్రాప్తించెను సం
ధివికలత గడపదాఁటను, గవయైతిని గఱ్ఱవట్టెఁ గంచుకితోడన్.

ఇక్కృతంబున నాయంశంబునం జనియించిన సుబలపుత్రుఁడు శకునియందు నాగుణసందోహము సంక్రమింప నేను విశ్రమించితిని. నాయధికారాంతము కూడ నైనది. కలిప్రభావమింక వెల్లడియగు కాలమువచ్చినది. పోనీ—

గీ. కృతయుగముఁ ద్రేతయట్టి సత్కీర్తిఁ గాంచ, కున్నఁ బోనిమ్ము తర్వాతఁ నెన్నఁ దగిన
వర్తనంబున మెలఁగితిఁ బ్రజలు చెప్ప, కొనెడు కలికాలవార్త నేఁ వినఁగఁజాల.

లోకాపవాదమును నేనీవార్ధకదశలో విని సహింపలేను.

గీ. కృతయుగంబును ద్రేతయుఁ గతమగుటనె, కీర్తిఁ గాంచెను జగతిసుకృతులు మెచ్చ
వర్తమానగుణంబులఁ బ్రజలు చూడ, రగుటను గతంబు మే ల్భవిష్యత్తుకంటె.

ఈకలిదురభిమానము చూడఁగాఁ గడుఁదీక్ష్ణముగానున్నయది. దంభములు చెప్పవారి నెందఱినెఱుఁగను!

కలి—(ప్రవేశించి తనలో) పూర్వకాలపు వేషములు నాయొద్దఁ బనికిరావు. అందఱిపలె నన్నుం దలంచువారు కేవలమూఢులు.

గీ. దురభిమానంబు క్రౌర్యంబుఁ దుష్క్రియాప, రాయణత యోర్వలేమి లోభావిలాంత
రంగమును గల్గు జనులనుఁ బ్రకటముగను, నాదు సేల్బడిఁ జూచినఁ నరుఁడెఱుంగు.

గీ. బోడిపసులకుఁ బోటు మఁప్పదును బోడి, తలలకును బోటవ్రేళ్ళకుఁ మెలులిడుదురు.
తలఁచినది బ్రహ్మదేవుఁడుఁ వలదటన్నఁ, జేయఁజూచెదరదియెంతఁ హేయమైన.

అబ్బ! నాప్రభావమును గవులుద్గ్రంథములు వ్రాయవలసినంతయున్నది. ఏనొక్కవెలుఁగు వెలుగఁ దలఁచియుంటిని. పిడుగుపడె నొక్కమాఱెవచ్చి పడితినా లోకులకని

ష్టము పుట్టవచ్చును. కాఁబట్టి ముందుగఁ గొందఱుశిష్యులను దిగ్దిలోకములోఁ బడ వైచి వారిజయాపజయములం బట్టి నావేషము బైలుదేఱఁదీయవలయును. ఇప్పటినటునకుఁ దగినట్లు దుర్యోధనుఁ డొకఁడు గజ్జెకట్టి కొంతకలాపము వినిపింపఁగలఁడు. వానికి సరిపడిన యంగుచేయువాఁడంగరాజుగా నియోగించితిని. ఆటలోని గుణాగుణములను దెలిసికొనలేకున్నను జెప్పినపనిఁ జేయుటకై యుపాంగముం బూరించువానివంటి దుశ్శాసనుఁడు మూఁడవవాఁడు. డోలుగొట్టుటకెవ్వరాయని వెదకుచున్నవాఁడను. నానత్యకాలపుఁ జెలికాఁడు ద్వాపరమును గూర్చుండఁబెట్టివచ్చితిని. కావున నాతనివలన నెఱింగికొందును. (అని నడచి ద్వాపరముంగాంచి) ఆలస్యమునకు క్షమింపుము.

ద్వాప—ఇదె వచ్చుచున్నాఁడ నంటివి. ఎందేగితివి?

కలి—నీకేమి నీముప్పు గడపుకొని పోవుచున్నాఁడవు. కాఁబోవువాఁడను నేను, నాకు జనవశ్యత కావలసియున్నది. దానికై తిరుగుచుంటిని.

ద్వాప—నాల్గునాళ్ళు గడచినే నందఱును వశ్యులే. కాని నగముచెప్పివిడిచితివి. సుబలరా జేమిచేసెను.

కలి—మ. కొడుకుల్మూర్ఖురు కాలముం బడయ నాకు న్శాంతివాటిల్లదీ
జడదాయల్మనుఁ గాంచి నవ్వెదరు నేఁ జాలం దపంబుండఁగాఁ
గొడుకుల్గాసిన పాడుకొంప నెటు మేఁ గొందుం బ్రవేశింప ని
య్యెడ నేరెంటికిఁ బాసితిం గడపుమా యీవొక్క ఖడ్గాహతిన్.

అని శకుని నెంతయేని బతిమాలెను.

ద్వాప—నారాయణ! తండ్రిని జంపుటయన్నఁ దన్నుఁదాఁ జంపుకొనుటయేగదా! కుడిచేయి యెడమచేయి యెఱుంగకుండ.

శా. పుట్టంధుల్వికలాంగు లార్తి యొకయప్పుడ్వీడకున్నట్టివా
రెట్టుం జూచిన నిష్ప్రయోజకులు నేరేనిం గడుం బిడ్డలం
బెట్టంజాలరు మృత్యువక్త్రమున సంప్రీతాత్ములా తండ్రులం
గొట్టన్నక్కఁ డెలెన్నగాఁ బెరిఁగియొక్కొండైనఁ జేసేతులన్.

కలి—బిడ్డా! తండ్రిమాట నిరాకరించితివను పేరే నీకుండుంగాని నాప్రాణమెట్లు నీదేహములో నుండదు.

గీ. ఆత్మహత్యకుఁ జాలక యుడవిఁదువకుఁ, గడపి నారాయణా యనఁగాఁ దలంప
నిద్దివిని నిల్చునే దగ్గనేని నూడు, ముక్కుతుమ్మిన నుండునే ప్రతియోఁడు.

అని కొంతభయపెట్టియుఁ బ్రోత్సాహపఱచెను.

ద్వాప—అద్దిర! ఇది గురుతరవ్యాపారమని భయపడఁడుగద!

కలి—తండ్రీ! నన్నేల సందిగ్ధసాగరమునఁ బడవైచెదవు. మిగిలినవాఁడ నొక్కఁడను. వినుము—

ఉ. చచ్చినవారితోడుతను • జావకపోయితి నిద్రలోనని
యొచ్చెము నాకు రాదుగద • యారక తండ్రిని జంపుకొందునా
రచ్చల మెత్తురే గురుశి • రస్స్మృతి సంశయ మెట్లు తీరునో
యెచ్చట ధర్మసూక్ష్మములి • వే తెలియంబడ వేమి సేయుదుర్.

(అని శకునిమిగులవగచెను)

ద్వాప— తరువాత? తనంతటఁదానే మృతినొందెనా! చావు మనచేతులలో నున్నదా! అట్లనరాదు, ఎంత క్రొత్తవాఁడైనను దాపసుఁడు గదా.

కలి—అపుడు సుబలరాజు ధర్మసూక్ష్మమో యధర్మసూక్ష్మమో యిది కాకున్న నింకొకటైన నేఁ బలికి నట్లాచరించెదవా యని కొడుకు నడిగెను.

ద్వాప—అది యేదియో?

కలి—పుత్రుం జూచి "కుమార! నాకెప్పుడైన నాత్మహత్య తప్పలేదు. ప్రాయోపవేశమున నసువులు విడుతును. పిమ్మట నెగ్గని తలంపక నావెన్నెముక సంగ్రహించి దానితో మూఁడు పాచిక లొనర్చుకొనుము. వాని యుపయోగముం జెప్పెద" ననియెను.

ద్వాప—రాజ్యము చేసికొమ్మనక వ్యసనములలోనికి దింపుచున్నాఁడు.

కలి—సుబలుఁడు త్రికాలవేది.

ద్వాప—వాని యుపయోగ మెట్లని వచియించెనో.

కలి—నీయన్నల నూర్వురం జంపిన దుర్యోధనుఁడు నూర్వురు తమ్ములతోపాటు నీచేతఁ జచ్చునుపాయ మిందున్నదని పలికె.

ద్వాప—అది యేరీతినో! ఇది వింతగా నున్నది. పాచికలతో నెట్లు చత్తురో! దధీచివలె వెన్నెముక నాయుధము చేసికొమ్మనలేదు సారెలతో రాజ్యమోడుదురు పేదవడుదురు గాని మృతియెట్లో నాయూహకు బొడకట్టుటలేదు.

కలి—పలువురు నిన్ను నిరభిమానివని తలంచునట్లు దుర్యోధనునొద్దఁ జేరి—

గీ. తండ్రి మడిసెను భ్రాతలు తండ్రికంటె, మున్నె గెడసిరి రాజ్యమా యెన్నవచ్చె
నెన్నివంకలఁ జూచిన నేను జాల, నధిపులకు నిందులకు నీవ యాదరువిఁక.

అని మచ్చిక చేయును. అతండు చూపోపనివాఁ డగుటచే పాండవుల యున్నతికి సహింపక నిద్రించు వారిని నీటఁ ద్రోయించి విషాన్నముం దినిపించి యింటికి నిప్పుముట్టించి బాధించును. అని యిపుడు మనము కన్నులార వీక్షించిన వన్నియు ముందే చెప్పియున్నాఁడు.

ద్వాప— దుర్యోధనుం డెంతకెట్టివాఁడో ! పాండవులం జంపఁగలఁడా తాను. కానిమ్ము. పాచికల యుపయోగ మేమని.

కలి— ఇంకను మయసభయఁట, జూదమఁట. వస్త్రాపహరణమఁట, వనవాసమఁట మైత్రేయశాపమట యుద్ధమఁట యేమేమో చెప్పినాఁడు. ఇవి ముందు నేను గనుగొనవలయును.

ద్వాప— జూదమంటివి ! ఎవ్వరితో నెవ్వరికి ? నీయడ్డసాళ్లేమైన నిపుడు తనిచేయునేమో.

కలి— ధర్మజునకు జూదమాడుట మిగులఁ బ్రియము. చేతఁగాని దుర్యోధనునితో నిపుణుఁడగు ధర్మరాజునకు జూదము పొసఁగించి శకుని తనయొద్దనున్న పాచికలతో నాడింపఁగా వానిలో లీనమైయున్న సుబలక్రోధము దుర్యోధనుని గెలిపించునఁట.

ద్వాప— ఇఁక దుర్యోధనాదుల కాపాచికలు మారణకారణము లెట్లయినవి. సుబలుని యభిప్రాయమేమియో !

కలి— నీవు వృద్ధుఁడవైనకొలఁది నీబుద్ధిబలము తగ్గుచున్నది.

ద్వాప— నిజమంతటిదేకాని నీప్రౌఢప్రజ్ఞనుపయోగించి వారికపకార మెట్లుజరగునో చెప్పుము.

కలి— తమకుఁ గావించిన యపకారమునకై కనలి పాండవులు యుద్ధము చేసి దుర్యోధనాదులం జంపుదురని తోఁచుచున్నయది.

ద్వాప— ముసలిరాజు కోపమెంతవఱకున్నది ! (తనలో) ఏమో నాకోపిక లేదు. నాప్రతినిధియ. శకుని కాలానుగుణముగా నుండును. నావలె నడచుకొమ్మనిన నట్లునడచును.

గీ. కాలమును బట్టినడతురు చాలవఱకు, జనులు ; తొల్లింటివర్తనల్లరగకున్న
నిందసేయుఁగరాదని పొందుగాను, బలికెను బరాశరుఁడు మును గలినిగూర్చి.

(ప్రకాశముగ) అనుఁగఁదలఁచినది మఱచితిని. నీవేమో మాటలాడవలయునంటివి శకుని కనఁబడినాఁడా ? అతఁడిపు డెక్కడనున్నాఁడు ?

కలి— తండ్రి మృతినొందినపిదప నింటికడ దుఃఖించు నెల్లవారినోదార్చి రాజ్యము మం

త్రులకప్పగించి యిపుడు హస్తినాపురము వెళ్ళియున్నాఁడు.

ద్వాప—అట్లయినఁ గ్రమముగ నన్నియుం దెలిసికొని నాకెప్పుడైనఁ దెలియఁజెప్పెద
వా లేక మనస్నేహమింతటిదేనా.

కలి—ఎంతమాట! అట్లే చెప్పెదను. రమ్ము పోవుదము.

(నిష్క్రమించుచున్నారు)

(అంతట దుర్యోధనాది దుష్టచతుష్టయము ప్రవేశించుచున్నది)

దుర్యో—(ప్రవేశించి) అక్కటా! దైవము నాయెడలఁ బక్షపాత మగపఱచుచున్నాఁ
డు. ఆటంకపఱుపని తల్లిదండ్రులు గల మఱియెవ్వరికైన నుండవలసిన యభిమాన
ము నన్నాశ్రయించి తనపరువు పోఁగొట్టుకొనుచున్నది. మాటపడి సహింపలేని న
న్ను వృద్ధజననీజనకులు వారించుటతో నేమితీరినది. యుధిష్ఠిరుఁడు—

మ. నను సభ చూడరమ్మని మ◆నంబునఁ గుత్సితనిశ్చయంబుతో
ననుజుల చేత నేయనక◆యైదు పురందగులంబుగొన్న దా
నిని దలఁపించు నాద్రుపదు◆సిగ్గులచేటగు కూఁతు చేతను
న్వాను వెనుకన్మెలంగి వెఱ◆పింపను నవ్వను జేయునిచ్చలున్.

గీ. మానుషము నిల్పుకోలేని◆మందు నన్ను, నందఱు సుయోధనుండను◆నల్లనేతి
బీరకాయను బోలిన◆పేరుగలిగెఁ, బ్రజలచే నాతనికి ధర్మ◆రాజటంచు.

(తలవాంచి కూర్చుండును.)

దుశ్శా—(ప్రవేశించి) ఏమీ! యన్నగారేదో నేఁడు క్రొత్తపుంతలో నడుగువెట్టినటు
లఁ గనఁబడుచున్నారు. తాను చేయించుకొనుచున్న సభానిర్మాణము నచ్చలేదేమో.

ఉ. శిల్పులఁ జూడమే యొకరు◆చేసినదానిని బట్టి చేయ; రే
స్వల్పమొ లోకమెంచి పని◆వానితనంబు గనంబడంగ నేఁ
గల్పన చేసి తెత్తు నని◆గంతులువేయుదు రామయుండు నీ
యల్పులు సాటిమా వృథగ◆నర్థమపాత్రుల కిచ్చుకొందురే.

అంతటితోఁ దీరినదా!

గీ. సొమ్ము పోవు మదికి◆సుతరాము నచ్చదు తృప్తి కాదు తప్పు◆లెంతు రొరులు
చూచి దానిమీఁద◆సొగసులు దిద్దుచో, నయ్యవారు క్రోతి◆యగుట నిజము.

(అని యట్టె యాలోచించుచుండును)

శకుని—(ప్రవేశించి దుర్యోధను నుద్దేశించి) అల్లుఁడా! ధర్మజపరిచారికానీతంబులగు
ధౌతవస్త్రంబులు ధరించి నీవు ప్రాతస్సంధ్యావిధు లొనర్చుకొనుచున్నప్పుడు గదా

నేను కర్ణునియొద్దికిఁ బోయియుంటిని. భోజనము చేయకుండ నితరవస్త్రములం దాల్చుటకేమికతము ?

దుశ్శా—(తనలో) ఈతఁడు సంకల్పము చేసినాఁడు.

దుర్యో—(వినిపించుకొనకయుండును)

కర్ణుఁడు—(ప్రవేశించి శకునింజూచి) ఇదియేమి ?

శకు—(నీవడిగి తెలిసికొనుమని సంజ్ఞ చేయుచున్నాఁడు)

దుశ్శా—(తనలో) వీరిగుప్తమంత్రజపమువలన నన్నగారికావేశము కలుగవచ్చును.

కర్ణ—దుశ్శాసనా! ముందు నీవా? కర్ణుఁడావచ్చినది? ఈతనికెట్టిస్థితి యెట్లువచ్చినది ?

దుశ్శా—నేనేవచ్చితినిగాని కారణము నాకుఁ దెలియదు.

కర్ణ—అడిగి తెలిసికొందును. (సమీపించి) రాజా! ఇదియేమి యిట్లుంటివి.

దుర్యో—(పెడమొగముపెట్టి) నాపట్టు నేను విడువను. ఇప్పుడు బ్రహ్మతోనైనను మాటలాడను.

కర్ణ—నీవుపట్టినపట్టేది? ఎవరిపైనీకుఁగోపము? నేనుగర్ణుఁడను. (అనియెదుటికిఁజనును)

దుర్యో—కర్ణుఁడుచెప్పినను వినువాఁడనుగాను. నన్నుఁ బలుకరింపవలదు. (రెండవవైపునకుఁ దిరుగును)

కర్ణ—(ఎదుటికిఁజని) ఆపంతమేమో తెలియఁజెప్పరాదా. రాజా!

చ. వలతులమేని నీవెనుకవచ్చెదమింతయొ యంతయో పనిం
దలనిడి మోచికొందును హితంబహితంబనిపల్కవేళకుం
బలుకక మూలమూలలకుఁ బాఱెడువాఁడను నేనుగాను నా
వలెనె మెలంగు మాతులుఁడుఁ బ్రాతిగఁ దమ్ముని నీవెఱుంగవే.

(అనిచేయిపట్టుకొనును)

దుర్యో—(విదర్చికొని) మీరునాతోఁ జావవలదు. నావలె మీరల్పాయుష్కులుకారు.

కర్ణాదులుముప్వురును—(గుండెలపైఁ జేయిడికొని వింతపడి యొకరినొకరు చూచుకొందురు)

కర్ణ—మేముజీవించియుండఁగా నీకాపాడుమాట యెట్లువచ్చును. అట్లుకానీయము.

దుర్యో—మీవిషయమై యట్లుగాకుండఁ జూచికొన్ననన్నుం గాపాడినట్లె.

శకు—నీవులేనినాఁడు మాకావిచారమేల. మేమును నీతోడివారమే.

కర్ణ—ఈమాటలకేమిగాని నీయభిప్రాయమేమి?

దుర్యో—ఓయికర్ణా! ఇంతస్పష్టపఱచినను దెలిసికొనలేని మీకాగోడవయేల.

కర్ణ—నీవు మరణప్రయత్నములో నున్నాఁడవని గ్రహించితిమి కాని దానికారణమర యఁ జాలకుంటిమి.

శకు—మేము క్రొత్తమార్గముం జెప్పవచ్చి నీయొద్దనొక క్రొత్తమార్గముం గనిపెట్టితిమి.

దుర్యో—మామా! మీ క్రొత్తమార్గమిపుడు కాదు—

మ. వనిత పరాభవింపఁ బడి ప్రాణము లెట్టులు నిల్పె నాసుయో
ధనుఁ డనఁ జాలోకనింద చెవిఁ దాకకయుండఁగ నాత్మహత్య నేఁ
డొనరిన ; దుస్ససేనునకుఁ బోడ్పడి చెప్పఁడు క్రొత్తమార్గ మా
తనికిని నన్నుపైఁ బ్రియము తద్దయుఁ గల్గిన వైరమిగుతక్.

దుశ్శా—అన్నయ్యా! నీపైఁ బ్రియమున్నవాఁడనైనచో వీరిమార్గమేల యవలంబింతును నీవొంటిగాఁ బోఁజాలమట నరయు నాపైఁ బ్రియమున్నట్లు తోఁపదు.

శకు—ఓహో! కర్ణా! వీరిద్దఱు నీదుదీనుని బంటులు. ఒఱులుదూసినకత్తులమని పల్కుచున్నారు.

కర్ణ—రాజా! పూర్ణీభవించిన యభిమానమూర్తులగు మిమ్ముం గాంచిన వెఱపుపుట్టుచున్నది. నాపైఁ గినియవలదు—

చ. ఇది మొదలా పరాభవము లింతికతంబున రాకకుఁ ; బలే
మొదలిటిదానిలోన నిది పోలఁగ నెన్నవవంతు తాతఁ జం
పుము ననిపోయి మామలను మొత్తితి వప్పుడె చావరాదొ! పో
టుఁదనము మాన మత్తతి నెటుల్ చవె నియ్యది యంత కెక్కుడే?

దుశ్శా—(తనలో) కర్ణుఁ డన్నగారి హృదయశల్యము కూఁడ బెఱికినాఁడు.

శకు—కర్ణా! ఇందు వీరు కినియుట కెడమెక్కడ? వాస్తవమే చెప్పినాఁడవు.

దుర్యో—అంగరాజ! నీవాక్యము లనాలోచితములు.

కర్ణ—ఏకారణమున నట్లంటివి?

దుర్యో—మూల మెఱిఁగినచో నీవిట్లనవు.

కర్ణ—దేనికైనను మూలము తెలియకయే చిక్కు పడవలసి వచ్చును.

శకు—ఈముసుఁగులో గ్రుద్దులాటయేల.

దుర్యో—ఇది ప్రస్తుతాంశమునకు దూరము.

మ. నను సామాన్యవధూపరాభవనితాంత జ్వాలికామాలికా
శన సంసిద్ధ నిరర్థదేహు ననువాం ఛాత్యక్త నిర్వాణము

త్నినిఁగా లోకమశేషముం దలఁచుచుం దూషించువాక్యాళిచే
తెను నుద్ధారముఁ జేయఁ జూచెదరె మీ దర్పోద్ధతుల్గాల్పనే.

శకు—(జనాంతికము) దుశ్శాసనప్రసంగములోనికెట్లుదిగినాఁడో చూడుము.

కర్ణ—ప్రస్తుతాంశమునకు సమీపమైన ప్రసంగమేది?

దుర్యో—మీమాటలకుఁ జెవియీక నాప్రయత్నము నేను జేసికొనుటయే.

కర్ణ—మా మొఱ్ఱయంతయు నరణ్యరోదనమునకు సాటియైనదా!

దుర్యో—మీది కానినాఁడు నావిచారమట్టిది కావలసివచ్చును.

శకు—నిష్ప్రయోజనప్రసంగ మేమిటికి—

చ. అనదలువోలెయత్నము నిరర్థమొ నిష్ఫలమోయెనర్పుట
ల్మన కుచితంబుగాదు పరమార్థము నారసి లోఁగుపాటుగాఁ
గ నెఱతేనంబుఁ జూపుము ప్రకాశముచేయుము లోనివంత మా
మానముల నున్ననాతినపుమార్గముదానికిఁ దోడుచేయుమా.

దుర్యో—నెస్సు! మీమార్గము మీదియే నామార్గము నాదియే.

కర్ణ—రాజరాజ! ఎన్నటికైన మీమార్గమే మాకనుసరణీయమని నమ్ముము.

దుశ్శా—(తనలో) కర్ణా! ఎంత బేలవు! నీమార్గమే మాకుఁ బ్రాపగుచున్నది.

దుర్యో—ఏమో! నన్ను విడిచిపెట్టుము.

కర్ణ—ఏమి యిట్లంటివి?

గీ. కర్ణుడంచు నొకఁడుగలఁడనునూహనీ, లోన లేక యున్నఁ బూనుకొనుము
నీకుఁ దోఁచినట్లు నీదారి నీది నా, దారి నాది కలఁడుకైన మసల.

(అని మోము త్రిప్పుకొనున్నాఁడు)

దుర్యో—(కర్ణునకుఁ గ్రోధముకలిగిన క్లైంచి లేచి) కర్ణా! ఇంతదాఁక నేను [illegible]
ములోఁబడియుంటిని. అది నేటితోఁ దీరినది.

చ. ముదుసళులౌటనో యనుజపుత్రులకగ్గగునంచునో మనం
బొదువును దుఃఖమన్న వెఱపుట్టుటనో తలిదండ్రు లడ్డుప
ల్కెద రెది చేయఁబోయిన నకృత్రిమపౌరుషశాలివయ్యు నీ
వుపలంచి తెట్టు లేల పాలిపోవదు నీపయి నమ్మకంబిఁకన్.

ఎట్లును నాపంతమును విడుచువాఁడను గాను. కాని మీహృదయము వేధింపకుండ నా
యభిమతముంజెప్పి మీయాలోచనలు వినియెదను. మీమునుఁగికొన్నప్రాపులు నన్ను
ద్ధరింపఁజాలవు.

కర్ణు—నీవు నన్ను మునలివారితో సమముచేసితివి. మిత్రధర్మము నీకింతగాఁ దెలిసిన దా! నిజమైననన్నే హితుఁడు–

క. తలిదండ్రు లన్నఁదమ్ములఁ, దెలియంగారాని మరుగుఁ దెలిసి సుఖంబు
ల్గలిగింపక యున్నిటికిం, దలయూచుచుఁ జూచునే మొదట చెడిపోఁడె.

ఏమన్నను నీయభిప్రాయము వినుదాఁక విడువను.

శకు—ఈతని భల్లూకపుఁబట్టు విడిపింప నెవ్వరితరము!

దుశ్శా—(మెల్లగ) దేనికైన విడుపుఁ బట్టు నుండవలదా! (కొంచెము బిగ్గరగ) అపుఁ గాదంచు వచించువారి పలుకులు, వారెవ్వరైనను విని విచారము సేయవలయును.

గీ. తనకుఁ గలపట్టు నిల్పుకోఁ, దలఁచి సఖుఁడు పలికినను వట్టిపట్టక పదటఁగలపి
మీరు నావెఱ్ఱిపుట్టినా, మేలటన్న నొకనితో బనియేమి వేయొక్కనికిని.

దుర్యో—ఈరట్టు నాకేల? చూడుఁడు. నామాటలనలన మీయందఱికి గినుక పుట్టించి నావెంటఁ గొనిపోదును.

కర్ణు—కినుక పుట్టింపుము. కాని ప్రాణములపై నిరాశ పుట్టింపకుము.

శకు—కినుక పుట్టియో నిరాశ చేతనో వెడలగొట్టక్కిన బాగుగదా.

దుశ్శా—అటనుండి నడుకుకొనిరమ్ము. పిమ్మట నాలోచించుకొందము.

దుర్యో—తెలిసియుఁ దెలియనివారికి బ్రహ్మదేవుఁడు చెప్పలేఁడు.

శకు—ఈమాట యందఱి యెడలను వర్తించును.

కర్ణు—(నీవద్దుపెట్టక చెప్పనిమ్మని సంజ్ఞ చేయుచున్నాఁడు.)

దుర్యో—చ. ననుఁనభ దూడ రమ్మని (అను పద్యమును జదువుచున్నాఁడు.)

కర్ణు—బాలురు, నాఁడువారును వెఱపించిన వెఱచినవాఁడు నట్టివాఁడే.

శకు—అల్లుడా పిమ్మట నెట్లు జరిగెను?

దుర్యో—గీ. మానమును నిల్పుకోలేని మందు (అను పద్యమును జదువుచున్నాఁడు.)

శకు—ధర్మజుఁ డట్టివాఁడు కాఁడు.

దుర్యో—నేనట్టి వాఁడ ననుట సత్యమేనా?

దుశ్శా—మామా! నడుమ వ్యాఖ్యానము వలదు. తుదముట్ట వినుము.

దుర్యో—పిమ్మట జపములని తపములని యిష్టులని మంత్రములని రహస్యములని రాజనీతులని నన్ను దనవలలోఁ బడవైచుకొని యీనడుమ గమ్మము కదులనీయక నేఁడని తెపని యాపినాఁడు.

కర్ణు—ఇందనత్కార్యమేమి? అన్నదమ్ముల పరస్పరక్షేమానుబంధము లట్టివే.

దుర్యో——ఓయీ! కలవునఁ బడినట్లు నాతో మీరును గుడిచి కూర్చుండి యింకను దె
లిసికొనిసిగ్గుపడరేమి!

శకు——తన నల్వురు తమ్ములవలెనే మనల నల్వురం జూచినాఁడు. తప్పేమి?

దుర్యో——బాగుగాఁ జెప్పితివి. తనతమ్ము లూరలేనపుడు మనకుఁ బిండిపెట్టి దగ్గఱదీసి
నాఁడని దీనియర్థము.

కర్ణ——(ఆలోచించుచుఁ దనలో) తప్పు లెన్నదలంచువారికి నిలిచినఁ దప్పుపలికినఁ ద
ప్పుగా నగపడును.

దుర్యో—— (కోపముతో) మీ పౌరుషము లెక్కడకుఁ బోయినవి? కత్తియొఱ
దూయరేమి!

శకు——అంతయు వినక యే! అట్లయిన నీవలె మేమును నిష్ఫలప్రారంభుల మగుదుము.

కర్ణ——(ఊరకుండుమని శకునికి సంజ్ఞఁజేయుచున్నాఁడు)

దుర్యో——ఆధర్మరాజు చర్యలు వినుండు. బోధయని గాథయని నన్ను బంధించి పడ
వైచి నాతోడి వేసములైన మిమ్ము నోరుఁ గట్టి తాపసవేషధారి యగు కలహదేవత
నారదుని మాటలను బట్టి దేవుఁడని చుట్టమని పిలువంబడు కృత్రిమదైవమగు కృష్ణుని
దురాలోచనలోఁ బడి తమ్ములను జాఁటుచాఁటున దేశములవెంటఁ బంపి ధనము గ
డించి యాగముఁ జేసినఁ యాతని రాజసూయయాగమును మీరు కన్నారు గదా!

(కర్ణుఁడు మొదలగు మువ్వురును తెల్లపోయి యొకరినొకరు కనుగొందురు)

దుర్యో——ఇపుడు మీ నవనాడులుడిగినవిగద, నాకంటె ముందు మీప్రాణములూడిపో
వు నింకొక్కమాట చెప్పెదను. నామనస్సులో నెల్లపుడును "పాండవులకును మన
కు నెప్పుడైన యుద్ధము రాక మానదు. అందు—

గీ. పాండవులతోడ నెపుడు కృష్ణుండుదిరుగు, శత్రువాతని కౌజరాసంధుఁడగుట
నతఁడు నాపక్షమునఁబిల్చినంతవచ్చి, యుద్ధమునఁ గృష్ణపార్థులనుక్కడంచు."

అని లెస్సగా నమ్మియుండ మాయచేసి యాదవదుష్టుఁడు వానిం జంపించినాఁడు.

(కర్ణాదులు దిక్కులుచూతురు)

దుర్యో——ఇంకనువినుండు.

కర్ణ——ఇందాఁడుదాని చేఁ గలిగిన పరాభవమును నీవు ప్రాణములు విడువఁబోవుటకుఁ
గలకారణము నెక్కడనున్నది?

దుర్యో——వెట్టివాఁడ! భోజనము చేయకముందె వస్త్రపరివర్తనమునకుఁ గారణమేమని
మాను మొదటనే యడిగినాఁడు.

శకు—అగును. దానికిఁ గతంబేమి ?

దుర్యో—ఆ పయిగొడవ మీకు బెదరుపుట్టించుచున్నది. కావున వేఱొకప్రసంగములోనికి దిగెదను. పాండవులను కృష్ణుని నారదునిఁ బల దన్నినవాఁడు మయుఁడని గు తెఱుఁగుడు.

గీ. ఖాండవం బేర్చినప్పటిఁ గనలు లోనఁ, బెట్టుకొని యింద్రుఁడే పార్థుఁ బిలుసమార్చఁ
బంపెనో తానుగా మాయఁ బన్నికొనియొ, తెచ్చెనో దీని సభయఁ దెలియకుండ.

ఇట్టిసభలో నెన్నిమాయలున్నవో మనకుఁ దెలియదుగాని నేనిప్పొద్దుః—

గీ. నీలమణికుట్టిమంబులఁ నీటిపట్లు, గాఁగ భావించి పైకెగఁ గట్టిబట్ట
నడిచితిని; నీటిపట్టులఁ నడువనైతి, జానుదఘ్న జలంబులఁ జాఱఁగాలు.

కర్ణ—వేఱొండు వస్త్రముం ధరించుటకుఁ గారణము తెలిసినది. ఆఁడువారి వెఱపింపులెక్కడ ?

దుర్యో—గీ. నీలములచేత నొకచోటఁ నీటిచేత, నొక్కచోట నమోసము నొందినట్టి
నన్నుఁ గని నవ్వె ద్రోవది నకులుఁ డాది, నవ్వఁ జొచ్చిరి యదినాకఁ నానగాడె.

శకు—ఇపుడు దీనికై నీవు చేయఁబోవు ప్రతీకారము ప్రాణత్యాగమా ?

కర్ణ—మొదట నట్లు తొందరపడి తలంచెను.

దుర్యో—తొందరపడ నేలేదు. వస్త్ర మెగఁగట్టుకొని నడచినపుడు నవ్విన ద్రౌపది వస్త్రము విప్పి పరాభవింపఁ దలఁచియు నాతలిదండ్రులు మీవంటిధర్మదేవతలు ఖిన్నులగుదురని యెవ్వరికి నిబ్బందిలేని యీమార్గ మాలోచించుకొంటిని.

కర్ణ—ఇదియా యెవ్వరికి నిబ్బందిలేనిది ?

శకు—కర్ణా! మనము దృష్టజంతులము. నిష్కారణము వ్యుతినొందియుందుము.

కర్ణ—అనాలోచితులగతి యట్టిదేయగును.

దుర్యో—నాయాలోచనము జెప్పితిని. ఇఁక మీక్రొత్తమార్గ మేది ?

కర్ణ—మేము త్రొక్కినమార్గము క్రొత్తది కానే కాదు. నీవెంట నుండువారమని మొదటనే చెప్పియుంటిమి.

శకు—నీకిష్టము లేనిదగుటచే గమనింపలేదుగాని యీసమయమునే గదా యుధిష్ఠిరుఁడు "సహసా విదధీత న క్రియాం" మని చెప్పినాఁడు.

దుర్యో—కర్ణా! ఏదీ మీవిమృశ్యకారిత్వముం గనఁబఱచి తొందరపడకుండ నాలోచించినమార్గము ?

దుశ్శా—(తనలో) ఏనెఱుఁగనిదికదా! కర్ణుఁడు లేనిదే మనకుఁ దోఁచదు.

కర్ణ— శకునియొద్ద మూఁడు పాచికలున్నవి. ధర్మజునకు జూదమాడుట మిగుల ప్రియము.

దుశ్శా—(తనలో) ఇఁక జూద మొక్కటి తక్కువవచ్చెనా.

శకు—(ఏమేమో చెప్పఁబోవును.)

దుర్యో—రాధేయ! నాకందుఁ బరిచయము లేదుగదా!

కర్ణ—నాకుమాత్రమున్నదా! శకునిమామ ప్రవీణుఁడు.

శకు—నేనైనను బైనుండి మీచేత నే యాడించి గెల్పించెదను.

కర్ణ—సాగుటకు యుధిష్ఠిరునిం బురిగొల్పుటలో నున్నది గాని గెల్పించుటలో నేమియు సందేహము లేదు.

దుర్యో—పందె మేమి నిర్ణయింతము.

శకు—వెనుకటి వన్నియు వలదు. ఆలోచించి చెప్పుము.

కర్ణ—ఎన్నియైనను గొంటిమి. వానితో నేమి., యిది వినుండు.

దుశ్శా—(తనలో) అన్నగారి ప్రాణమిత్రు డిపుడేదియో విశేషవిషయమునే తలఁపెట్టియుండును.

శకు—(లేచియేమో చెప్పఁబోవును)

కర్ణ—చ. తలఁచితి మెన్నియేనియు విధంబులు వాని ప్రసక్తి యేల నీ
కు లలన నొంచు పంకము విడుంతితి మేని బణంబురీతిగా
గెలిచినవారిముందటను గెల్వనివారి సతి క్రయంబున
న్నిలుపఁగఁ జేయుటే యని వినిశ్చయ మొప్పఁగ నాడఁజాలుదే.

దుశ్శా—(తనలో) ఈతఁడు కానీనుఁడైనందులకు ఫలముగా నాఁడువారి నంగడిఁ బెట్టుచున్నాఁడు.

దుర్యో—యుధిష్ఠిరునితో నీపందెము వేసి నేను జూదమాడవలయునా! మీరిది చక్కఁగఁ దొందరపడకుండ నాలోచించినదేగద.

శకు—భానుమతి నలువురిలోనికి రావలసివచ్చునేమో యనుభయమువలదు.

దుశ్శా—మామా! ఇదియేనా క్రొత్తమార్గము.

దుర్యో—ఎదుటికి ద్రోవదివచ్చినంతనే మన పరాభవానలము చల్లాఱునా!

దుశ్శా—(తనలో) అప్పుడె ద్రౌపది వచ్చినట్లే యన్నగారు పొంగుచున్నారు.

కర్ణ—ఎదుటికి వచ్చినట్లు చేసికొందుమేని పిమ్మటఁ గర్తవ్యమెట్లో నెఱవేర్పవచ్చును.

దుర్యో—పాండవులయెదుట మనమామె నేమి చేయఁగలము.

కర్ణ—(ఆలోచించి) ఉండుముండుము! ధర్మరాజు ప్రాతస్స్నవనము ముగింపకమున్నే నిన్నుఁ బాంచాలి నీలమణికుట్టిమంబుకడఁ జూచినట్లు పలికితివే! ఆమె రజస్వలయైనదా?

శకు—(ఏమో చెప్పవలెనని లేవఁబోవును)

కర్ణ—(వారించి) తాళుము. నామాటకుఁ దగినసమాధానము దుర్యోధనునిచే విననిమ్ము.

దుర్యో—అట్లేతలంచుచున్నవాఁడను.

శకు—అట్లయిన ధర్మరాజు నోడఁబఱచుట జూదమాడుట యక్కఱలేకుండ—

గీ. ఎవరియింటుల వారుండుకరిపుడు పార్థు, లెక్కడో మూలమూలలఁగ్రుమ్మయుండు
నచ్చటికిఁ జని నిర్మూలితేరనుచుఁ జెప్పి, పరిభవం బొనరించిన బాధయేమి?

దుశ్శా—ఆహా! మామగారి యూహలు కన్నులుమూసికొన్న పిల్లియూహలువంటివి!

దుర్యో—మనమందఱ మక్కడికిఁ జనిన నల్లరియగును.

కర్ణ—పోనిండు, ద్వారకనుండి కృష్ణుఁడువచ్చెనని చెప్పి పిలిచికొనివత్తమా!

దుర్యో—ఎవరుపోయి పిలిచిన నమ్మివచ్చును?

శకు—(దుశ్శాసనునువంక దిరిగి) చిన్నవాఁడును వఱదియు నని దుశ్శాసనుని పల్కులు నివచ్చును.

దుశ్శా—తువకు నేనా మాకగపడితిని!

గీ. దున్నయును దున్నయును బోరిదూడకాలు, విఱుగఁద్రొక్కినరీతిఁగ వించినారు
మీరుమీరునునూహించిమిక్కుటంపుఁ, గార్యమునఁ బెట్టి నన్ను నిష్కారణముగ.

కర్ణ—ఏమీ! మీయన్న చెప్పినపని నీకు సమ్మతముకాదా!

దుశ్శా—మాయన్న చెప్పినదా, మామ చెప్పినదా?

దుర్యో—తమ్ముఁడ! ఒక్కవిషయమైయాలోచించువారెవ్వరేది చెప్పిన నదిసంఘవాక్యముగా భావింపవలయు.

దుశ్శా—అన్నా! అనర్థకారి యగు నీపనిలోమాత్రము దీర్ఘాలోచన మక్కరలేదా!

కర్ణ—ఓయి! ఇది ధర్మరాజు ప్రాతరగ్నికార్యములు ముగియకుండ నెఱవేఱవలసియున్నది.

దుర్యో—చేసినపిమ్మటఁగదా ఫలాఫలములం గూర్చినవిచారము. జరగినదేయేల యింతవఱ

దుశ్శా—అయ్యో! ఈసంకల్పసిద్ధులు తలఁచినది నిప్పుల మెన్నఁడును గాదు.

శకు—విచారముతోఁ బనికాదు. వేగిరింపవలయును.

దుర్యో—తమ్ముఁడా! నీవింపు భిన్నాభిప్రాయుఁడవేని నాయత్నము సాగదు.

దుశ్శా—మీయాందఱిలో నేనొక్కఁడను బ్రతిచెప్పిన సాగునా! ఏమి జరగునో చేసియే చూచెదను. (అని నడచుచు) ఆమెయా మహాపతివ్రత! వీరా మహామూర్ఖులు; పాండవులా దైవవరజనితులు. చేయుకార్యమా తలంపరానిది. శివశివ!

గీ. నాకు దుశ్శకునంబు లనేకములు శ, రీరమున మార్గమునఁ దోఁచి నీరుసేయుచున్న వుల్లంబు వ్యథకాదు చిన్నవోదు, రిందఱును నోరుదెఱచి యీకృత్యమునను

అంతవఱకేల ఆమె యిక్కడకువచ్చునా! ఏమో- కృష్ణాగమనముం జెప్పినరానేవచ్చును. అక్కటా! పాండవులలో భీము డధికబలుఁడని బలసత్త్వసంపన్నులగు తండ్రిగారే చెప్పుచుందురు. అట్టివాఁడు నాస్వభావ మెఱిఁగియున్నను నేనొనర్చినకృత్యము పరప్రేరితమైనను గినిసుక తునియలుసేయక యూరకుండునా! ఓమహాదేవ!

గీ. పరులప్రేరేపణనొ స్వకల్పననొ యిట్టి, దుష్టకార్యంబునకు నేనుఁ దొడఁబడితిఁ
బలుకులేటికి నీనవహా వాసదేవ, మేమిసేయఁగ నున్నదో నామిఁగతియు!

ఈనాయవస్థ పెద్దవారిమాట జవదాఁటుటకుఁ జాలదు. కాఁబట్టి చేయుపనిలో నొడలు దాఁచుకొనరాదు. ఓయుమారమణ నీవేకలవు.

(అనిపరిక్రమించి దూరముగానడచివచ్చు ద్రౌపదితోఁ బ్రవేశించుచున్నాఁడు.)

ద్రౌప—మఱంది, శ్రీకృష్ణభగవానులెక్కడ? నీవుదర్శించినావా?

దుశ్శా—నేనుదర్శింపలేదు. అన్నగారు నినుబిల్చుటకై పంపిన వచ్చితిని.

ద్రౌప—(తనలో) ఏయన్నగారు! నాకుఁ గృష్ణదర్శనమన్న నెన్నఁడులేని జంకపొడముచున్నది! (ప్రకాశము) కృష్ణుఁడేమికారణమున నింతలోనె వచ్చెనో! వారందఱు నెచ్చట నున్నారు? కానిమ్ము, అతని నెన్నిసారులు చూచినఁగఱువుదీఱదు. (అని నడచుచు దుర్యోధనాదులున్నచోటికివచ్చును.

దుశ్శా—(దుర్యోధనాదులయొద్దికివచ్చినిల్చును.)

ద్రౌప—దుశ్శాసన! మీయన్నగారెక్కడ?

కర్ణ—ఏమీ! మదాంధత! ఎదుటివానిం గానకుంటివి!

దుశ్శా—(తలవాంచియుండును.)

ద్రౌప—ఏఁడీ! శ్రీకృష్ణుఁ డెక్కడ?

దుర్యో—ఓసిగ్గిఁడి?

క. మను నూర్వర నూఱవతా, రము లనిదశరూపధరుఁడు ప్రాకృతగతి బీ
రము దొలఁగి దాగియుంటివి, ధను సెఱుఁగవె యింక నతని దాచెదమిటికిన్.

ద్రౌప—(తనలో) కటకటా! ఇదిచూడ మోసమువలె నున్నయది. పతులేవురుఁ ద్రౌ
తరగ్నికార్యములలో నున్నారు. వారిని బిలిచిన వ్రతభంగము. మఱియు నా
పవిత్రధ్వని వారిచెవిం బడఁరాదు. ఏమిచేయుదును. (ప్రకాశముగ) దుశ్శాస
శ్రీకృష్ణుఁ డెక్కడ?

కర్ణ—ద్వారకలో నామూలసౌధములో నున్నాఁడు.

దుర్యో—(పరిహాసపూర్వకముగ) కర్ణా! ఆఁడువారితో నసత్యము లాడకుము.

ద్రౌప—ఇదియేమి మీవాక్యములు వింతగా నున్నవి.

దుర్యో—వింతయేలేదు, నిశ్చయమైనమాటయే చెప్పెదను.

గీ. ధార్తరాష్ట్రుల దర్పంబుఁ దలఁచి యింకఁ, దనదుగంతులు సాగవన్నమనముతోడ
చౌబపమువోయి కృష్ణరూపంబు విడిచి, యడఁగెఁ గృష్ణాకృతిగొనినీయందతండ

ద్రౌప—(నిరాకరణముగ) ఇంక నేమి, స్త్రీపుంసవివక్షతలేనట్టియు సర్వాంతర్యామియ
నగు నప్పరమాత్మ నాయందున్నట్లు మీరు తెలిసికొన్నారు. దైవమున్నచో నెట్టి
గియు నేల యీవెఱ్ఱిపనిఁ జేయఁదొడఁగిరి.

దుర్యో—నన్నవమానించిన నీకు బుద్ధిచెప్పుటకు.

ద్రౌప—(నిర్లక్ష్యముగ) అన్నియు దైవము చేయవలయును. నరులేమి చేయఁగలరు.

కర్ణ—ఓసీ! నీవానమ్మకముమీఁద నేయుండుము. నరులు చేయునదియుఁ బరులు చేయు
నదియుఁ దెలిపెదము.

ద్రౌప—నన్ను మీరేమి చేయఁగలరు.

దుర్యో—తమ్ముఁడా! దీనికొప్పావడిసిపట్టుము.

ద్రౌప—ఆతఁడేమిటికి? చిన్నవాఁడు. బలదర్పితుఁడవగు నీవేల రావు?

కర్ణ—మేమిందఱుండ నాతఁడేలరావలయును.

దుర్యో—మామా చూచెదవేమి?

ద్రౌప—చూడక చేయుదేమి?

దుర్యో—ఈయల్పురాలి ప్రతాపమేమో చూతము. కర్ణా! మామా! ఊరక
దురేమి?

(అందఱు నొక్కసారి పైఁబడుదురు.)

ద్రౌప—హా సర్వాంతర్యామి! కృష్ణా! కృష్ణా! ద్వారకావాస!

(అని యంతర్ధ్యానము నొందును)

దుశ్శా—(చేయిమీఁదికెత్తి) అన్నా! కొప్పుపట్టుకొనఁబోయిన నాచేయి క్రిందికిరా లేదు. కాలుకదలదు!

దుర్యో—(వంగి) తమ్ముఁడా! వస్త్రమువిప్పవలయుననిగట్టిపట్టుకు వంగిన నాస్థితియునట్లే యున్నది.

శకు—(నిలువుననిలిచి) కర్ణా! ఇదియేమి, మనయాలోచనమునకు భంగము వచ్చినదే! మఱియు నాయొడలు నాకు స్వాధీనములేదు.

కర్ణ—మీవలె నేనును గదలలేను సరిగదా పైఁగా దేహమంతయు మంటలు పుట్టు చున్నవి.

దుశ్శా—అన్నయ్యా! నాశరీరము కదలదేమి.

దుర్యో—నే నెవ్వరితో జెప్పుకొందును. కర్ణా! మమ్మేనా క్రొత్తమార్గమాలోచించి యుద్ధరింపవేమి? మామా మిన్నక చూచుచుండుట తగునా! నన్నుఁ జావనీయక చేసిన యుపకారమా యిది!

నారదుఁడు—

చ. తెలిపితి నే యాఁదుకృష్ణుని యుదీర్ణపుఁబౌరుష నుల్లిపౌరుషం
బులు గలమీఁదు స్త్రీత్వమును బోలదుచాలను జాలులెందు మీ
తలఁపులు సాగ్గనేని నిఁక దైవముతోఁ బనియేమి స్త్రీలమూ
ర్ఖులవలె నిట్లు చేయుదురొకో మిముఁబోటులు వేగిరించుచున్.

(అనుచు ప్రవేశించి) దుర్యోధన!

క. ఎవ్వరుఁ జూచుట లేదని, యెవ్వనిపనిఁ జేయఁజూతు రీ మీ రిపుడో
నవ్వదె లోకము దైవం, బెవ్విధమునఁ జూడకుండుఁ నీకృత్యంబుల్.

విద్యావిహీనులా కారు, అజ్ఞానులా కారు, వీటికేయనాలోచిత కార్యము జేయఁ బోయిరి!

దుర్యో—స్వామి! నారదమునీంద్ర! కోటితో మీకు నమస్కారముఁ గావించుచు న్నాఁడను. మామయుఁ గర్ణుఁడును జక్కఁగ నాలోచించియే చెప్పినారు.

నార—ఆత్మబుద్ధిసుఖము, పరబుద్ధివినాశకారియని యెఱుఁగవా!

దుర్యో—నే నెఱిఁగియే నాకుఁదోచినట్లు చావఁబోయిన వీరు మానిపించిరి.

నార—దానికేమిగాని—

ఉ. ఇది శ్రీకృష్ణకృతంబు దీనిఁ గడవన్ శ్రీలోకమం దెవ్వఁడున్
చెప్పన్లేఁ డదియుండనిండు; విని యీవృత్తాంతముం బాండవు
ల్పదిలుల్ వచ్చుచునుండి రిట్టిమిముఁ ద్రుంపన్ వారి కేపాటి నా
మది శ్రీకృష్ణుఁ దలంచితిం జనుఁడు క్షేమంబౌత మీకింతటన్.

గీ. వారితో మీరుపోరంగ వలఁతురయ్య, వచ్చుచున్నారు నృకుల నృపమ్ముఁ గొనుచు
నవియె మీపాలిటికిని వజ్రాయుధమ్ము, లిట్టిమిముఁ జంపఁ బాణాదు లేటికయ్య.

ఆవాసుదేవపరమాత్మకు నాయందలి కారుణ్యంబున మీకు బంధమోక్షంబుగలుగుఁ గాత!
మెలఁకువగలిగి చరింపుడు. నేను బాండవులకోపోపశమనముం గావింపఁబోయెదను.

(అని నిష్క్రమించును)

(అందఱును నిష్క్రమింతురు)

ఇది పంచమాంకము.





శ్రీమదుమారమణాయనమః.

# దుర్యోధనాభిమానము.

## షష్ఠాంకము.

(ధృతరాష్ట్రుఁడును దుర్యోధనుఁడును బ్రవేశింతురు)

ధృత — పుత్రా! నీవింత వెంగలివేమి! నీబలమును నాయధికారము నేమిపనికివచ్చుచున్నవి. కాలబలమని గ్రహించి యూరకుండవేమి. పరిభవింపఁబడినకొలఁదిఁ జల మెక్కుడగుట సహజమేకదా!

దుర్యో — తండ్రీ! నీకు నేను బుత్రుఁడనా శత్రుఁడనా?

మ. జననంబప్పుడె వీని వీడుమను మజ్జ్యోతిష్కులాడన్ ద్యజిం
పనిదే హేతువు నన్ను; నాయెడలఁ బ్రేమంబున్నచో సౌఖ్యము
ల్గన నీవేటికి రాజపుత్రుఁడయి భిక్షంబెత్తఁబో సిగ్గు వా
రనిదుఃఖంబిది యింక నాకు నుభయభ్రష్టత్వమే దిక్కగున్.

ధృత — బిడ్డా! (కన్నులకుఁ దలఁద్రిప్పి) నీవుగాక యిక్కడఁ బరులెవ్వరును లేరుగదా!

దుర్యో — లేరు, నేనొక్కఁడ నేయున్నాఁడను

ధృత — మ. పరసంజాతుఁడ వంచు నేనెఱుఁగుదున్ గౌరవ్యవంశంబు నీ
తెరమం దెంతయు వర్ధనంబు గనునన్ ధైర్యంబునాకుండె ని
ర్భరశోకంబున ముద్దుముచ్చటలు తీర్పన్లేక నే బ్రుంగితిన్
బరనిందల్పడలేను గొంతయిటు సైపన్బోలు నీ కాత్మజా!

దుర్యో — రాజదూషకులకు శిక్షాస్మృతి దండమును విధించుచున్నదిగదా!

ధృత — పరులనఁగా దండార్హులయినవారుకారు.

గీ. విదురుఁడొప్పుకొనఁడు భీష్ముఁడు నతనికి, ముందె సమ్మతింపఁ డెందరైన
మంచివందురనుము మక్కువపడియున్న, ప్రజలఁ ద్రిప్పలేను వ్యత్యయముగ.

దుర్యో — మనకీద్వీపాంతరాచారము లెప్పుడువచ్చినవి. సగుణుండు నిర్గుణుండై పూజింపఁబడు నీశ్వరునట్లు సర్వాధికారమును నీయందుఁబెట్టుకొని యశక్తునివలె నీవారు లాడించిన బొల్ల నాడుచుంటివా!

గీ. పరులఁ గాంచి నీవు భయపడియెదవేమి, బరులఁ గాంచి దుఃఖపడుచునుంటి
మనసు శక్తి లేదు మనలోనె మనమిట్లు, గ్రుళ్లి చావవలసెఁ గుత్సితముగ.

మొదటినుండియు మనలోపమె యెక్కుడుగానున్నది.

ధృత—అది యిట్లు పుత్రా!

దుర్యో—నీవే యుంటివిగదా! యెండలోఁ ద్రిప్పుకొనినను ప్రజలను ద్రిప్పఁజేనని.

ధృత—అగును ధర్మజు యౌవరాజ్యమునుండి మరల్ప నిపుడు నాతరమా!

దుర్యో—తండ్రీ నేను మరలించెదను నీవూరకుండువా? వేళ్లుపాతినపిదప నూడఁబెఱుకుట కష్టము గాని నాటుకొనుచున్నపుడది సులభమే.

ధృత—మరల విషభోజనము పెట్టుదువా!

దుర్యో—రాఁబోవు గంగాపుష్కరమున కని నీవు వారణావతమునఁ గట్టనాజ్ఞ యిచ్చిన భవనమునందే నీకుఁ దెలియకుండ లక్కగోడలు నాజ్యకల్పితదారువులుగా నొనర్పించి యున్నాఁడను.

ధృత—వారి నేయుపాయముచేతనో యక్కడకుఁ బంపఁగలను. కాని నిన్నుఁ గన్నుగప్పి విదురాదులాకీలెఱింగియుం దెలియఁగనివారివలె నటింపవచ్చును.

దుర్యో—కృతకృత్యుఁడనైతి నేని యిపుడు పాండవులున్న యైదుచోట్లు మీకిచ్చెదనని యాస పెట్టియున్నాఁడను. శిల్పులున్న మోనము చేయుదురా?

ధృత—ఇందును దేహమే తోఁచుచున్నది. అనపాయముగ నుపాయ మొకండొక్కటి వెదకఁగలవేని బాగు.

దుర్యో—తండ్రీ నాకొక్కటి తోఁచుచున్నది.

ఉ. ఏమి నపెట్టియైనను బం దేఁతులు వారినిదూరవంపిన
స్వామియు నీతవాతములుఁ బొన్పడ కీర్తిన గిల్లవచ్చు తే
దా మఱితోడితెత్తుమను మప్పటి కీ ప్రజలెల్ల నాపయిం
బ్రేముడిగల్గు వారినిగఁ ద్రిప్పుకొనంగల నేఁ బ్రవర్తనన్.

(అంతట శకుని ప్రవేశించుచున్నాఁడు)

శకు—(తనలో) మనస్థిమితము లేక పిచ్చిపట్టినట్లు తిరుగుచున్న సుయోధనునకుఁ దండ్రి మాటలు రుచించునా! ఒకప్పుడు తేలిపోయినను మాయూహాతే, కించిత్సహాయమైనను గావింపవలయును. ఇపుడు నాకొక క్రొత్తయూహ పొడకట్టుచున్నది. దీనిని నష్టుఁడునుఁ గూడఁ జెప్పకుండ నేను సుయోధనునకు బోధింపవలయును.

ధృత—(భీముబలము దలంచుకొని కొంతసేపూరకుండి) పుత్రులార! చక్కఁగా జ్ఞప్తికిఁ దెచ్చినారు. ఆపుడట్టి యవస్థయే పట్టును. (ఆలోచించి) ఇంతకంటె మంచియుపాయ మేది?

శకు—(తనలో) నాపాచికలసంగతి జ్ఞాపకము చేయుటకు సమయమే దొరకలేదు.

దుర్యో—(ఆలోచించి) పాండవాగ్రజునకు జూదమన్నఁ బ్రియము; నాకు బరిచయము లేదు. వెనుక మామ చెప్పినరీతిని ధైర్యమూని మాయిరువురకు నొకయాట కల్పించెదను.

శకు—(తనలో) బలే మంచిజాలులోనికి వచ్చినాఁడు.

ధృత—తనయా! యుధిష్ఠిరుఁడంత యవివేకి కాఁడు. చేతఁగాని నీతో నాతం డెట్లును దీనికిసమ్మతింపఁడు.

శకు—అతఁ డెంతనిపుణుఁ డైనను నే నల్లుని గెలిపించెదను. మాయింట నను శ్రుతముగ వచ్చుచున్నవి; ఎన్నఁడును బరాజయ మెఱుంగని యీ గడ్డసాళ్ళు. (అని రొంటినుండి తీసి యెదుటఁ బెట్టును.

ధృత—నిన్న సేకదా వారిని నీపైఁగలకోపము విడిచినది. మరల నేఁడే వన్నగడ చేసిన లోకులునిందింపరా!

దుర్యో—మనకెప్పుడును లోకుల భయమే పట్టుకొన్నది.

ధృత—తనసొమ్ము తాను దినుచున్నను లోకులకు భయపడుమని లోకోక్తి కలదుగదా! కానిమ్ము చెప్పుము.

దుర్యో—ఎవ్వరోడిన, వారు తన తమ్ములతో భార్యలతో నితరరాజ్యములు వనములుం గ్రుమ్మరి రావలయు నని నిశ్చయింపవలయును.

శకు—ఇది లెస్సగా నున్నది. ఓడినవా రెవ్వరైన బందము సమానముగా నేయున్నది.

ధృత—మనకే గెల్పువచ్చునని యెట్లు చెప్పవచ్చును.

శకు—రాజేంద్ర! ఇన్ని దినము లైనది.

గీ. సారె ముట్టించె నాకుఁ బంచాంగశుద్ధి, గల్గు దినమునఁ జచ్చి స్వర్గంబునందుఁ
గలఁడు నాతండ్రి యాతనిఁ దలఁపువేఱు, కావుట యెఱుంగ నోడుటఁ గలనెఱుంగ.

ధృత—అట్లయిన నిది యెన్నఁడు జరగవలయును.

శకు—ధర్మజుం డొంటిమై రాజకార్యనివేదనకై నీసన్నిధికి వచ్చినపుడు మంచి సమయము.

ధృత—అతనితో నే నేమని యుగ్గడింపవలయును?

దుర్యో—(తనలో) ఇపుడె నీవు యౌవరాజ్యభారమును మా దుర్యోధనుని పైఁ బెట్టుమని. (ప్రకాశముగ) నీవు చెప్పినట్లు వినునని ధైర్యమున్న పుడే మనసను ననవచ్చును.

ధృత— నేనిది పాండుపక్షము లోపల మీరేమియు వారితో వైరము తలపెట్టఁ దగదు. సంధ్యాసమయము కావచ్చినది. మీరు పొండు.

దుర్యో } శకుని } నిష్క్రమించుచున్నారు.

ధృత—చూచి చూచి వీనిపైఁగల ప్రేమను మాఱపఁజాలను. చెప్పినమాట వినఁడు. ఒరులఁ గాంచి యోర్వఁడు. పాండువు లతిబలాఢ్యులు, ఆలోచనాపరులు. నా యుపేక్ష యొకటి కాలానుగుణముగా జరపుచున్నది. ఏమిచేయుదును! ధర్మోజయతి! ఎవ్వఁడురా! నన్ను లోనికిఁ దీసికొనిపొమ్ము.

సేవకుఁడు—(వచ్చి తీసికొనిపోవును)

(పిదప వనవాసవేషములతోఁ బాండవులు ద్రౌపదీసహితులై ప్రవేశము.)

ధర్మ—తమ్ముఁడా! నీవు శాంతించి యుండవలయును. (అని భీముని చేయిపట్టుకొనుచున్నాఁడు)

భీమ—మేము శాంతించియుండవలయును. మీరొరులు చెప్పినదానినెల్ల త్వరపడి చేయవలయును.

ద్రౌప—మీయన్నగారు జూదమన్నఁ జెవికోసికొందురనునది మనకేమి క్రొత్త!

ధర్మ—మీరలె చెప్పుడు ఎన్నఁడైన నోడితినా!

అర్జు—అన్నయ్యా! ఎల్లప్పుడు మనలను జెఱపనే చూచువారేమి పన్నజాలరు. అట్టివారితో కలనైన నాడవచ్చునా!

క. చలముననో బలముననో, యిలువెడలం గొట్టు నెత్తు లెప్పుడుఁ దలఁచుం
దులువల సహవాసంబును, దలఁప న్నేరయితి గట్టితరుణమునందున్.

ద్రౌప—లోకము గొడ్డువోయినదా! మనమేవిధముననో విడిచిపోయినంతనె రాజ్యమంతయు దక్కునని సంతసింపవచ్చునా!

నకు—అట్టియభిప్రాయము వారికున్నట్లు మన మెఱిఁగియుంటిమిగదా! ధృతరాష్ట్రుఁడే యొద్దనుండి దానికిఁ బణంబిది యని చెప్పినప్పుడు మీరు—

గీ. ఈవు కొడుకుల పైఁ బ్రేమ నిట్లు చేయుం, చుంటివేని భయంబేల యొసఁగు మెల్ల
యౌవరాజ్యంబు; వినుము మాకవల యొక్క, లున్నవని చెప్పివచ్చిన నొప్పుఁ గాదె!

భీము—అంతమాటయని యొరుల మనసు నొప్పింతురా! ఎంతయైన మనమే కష్టపడవల యును. ఇది యంతయు నేల. ఒక్కమహాకార్యము నన్ను విడిచిపెట్టదు.

చ. మనలఁ బితృవ్యపుత్రులనమాయికుల న్సయిపంగ లేసియా
చెనటులఁ ద్రుంచి దోర్బలముఁ జేవయు నేర్పడ దుస్ససేనుపు
త్రుని కిడి సర్వరాజ్యము పిరోధములత్క్షణమునందుఁ గూర్చెదన్.
వెనుకను వారువారు సురిపెట్టుకొనంగల రానిమిత్తమే.

ద్రౌప—అయ్యో! బిడ్డలకు వారిద్దఱికి శత్రుత్వము గూర్పవలదు. అందఱును మనవ లెనే యుండవలయునా!

సహ—అన్నయ్యా! తండ్రిలేని బ్రదుకువలని ఫలము మనమనుభవించుచుంటిమిగదా!

భీము—"అవశ్యం పితురాచార" మ్మని యున్నదిగదా!

ద్రౌప—నాథా! తలిదండ్రులులేని బ్రదుకు పసివాండ్రకుఁ గష్టతరమైనది. మనమిందఱ ముండియు బిడ్డలను శత్రుమధ్యమున విడిచిపెట్టితిమిగదా! తండ్రిలేని యాబిడ్డలకుఁ బ్రాపెవ్వరు?

భీము—ఏనువలంచినట్లు చేసితినా మనకుఁ బిమ్మట నడవియే రాజ్యముకాన మనబిడ్డలు మనతోడనే యుందురు

అర్జు—అప్పుడు మనపిల్లలకు "అవశ్యంపితురాచార" మ్మను న్యాయము పట్టును.

ధర్మ—వారినడవికిం గొనిపోవునియమము లేదు కావున నిచ్చట విడువవలసివచ్చినది.

ద్రౌప—అక్కటా! నాబిడ్డలకేమి యుగ్గుపాడమునో!

భీము—తలిదండ్రులొద్దలేని బిడ్డలని మనకువలె నే-

చ. వినుమన నన్నముం గుడిపి వేమఱుఁ బాములనాడుకొమ్మటం
చౌనఁగి జలాశయంబులను నొప్పఁగ మజ్జనమార్పముంచుచు
న్నిసువులఁ బక్కలో నొశయనించినయప్పుడు నారిమీఁదనో
వెసఁ జలివేయకుండ గప్పించెద రెట్టినిచంద్రనిప్పలన్.

ధర్మ—తమ్ముడా! నీవు ద్రౌపదికి భీతిఁ బుట్టించుచున్నాఁడవు. అట్లెన్నఁడును జరగ దు. ఒక్కనియమమునకుఁ గట్టువడినవారది గడచువఱకు రెండవదానిం దలపెట్టరాదు.

సహ—వారా న్యాయము నతిక్రమింపనివారు.

అర్జు—ఏదియో! అన్నింటికి సమ్మతించి యిల్లు వెడలితిమి.

ధర్మ—నిజమే, ఇంతవఱకు మనము వాదించినదంతయుఁ జాలక పీడింబడి వాదంబొకటి యా. ఒక్కనామాట వినఁవలయును.

మ. మిము నా ప్రాణములట్లుగాఁ దలఁచి ప్రేమిం జూదమం దోడితిన్
సముదున్యత్యయత స్సహించి వనవాసక్లేశమీరున్నచోఁ
గ్రమ మొప్పన్ ధృతరాష్ట్రజాధములఁ బాఱంద్రోలి యీ రాజ్యభా
రము మీపై నిడకున్న నన్విలకుఁ డీ ధర్మరాజాఖ్య చేన్.

భీమ—ఇఁక మాకు నోరెట్లాడును. అట్లయిన నా ప్రజ్ఞ వినుండు. రాజ్యము సంపాదించు భారము నీమీఁదఁ బెట్టుకొంటివి కావున నీకు సహాయుఁడనై—

చ. హరి సనుదెంచి నాఁ డనుచు నార్తవభాఞ్ఛన సత్యమాడి పి
ల్చిరి సభ కంతఁ బోక మెయి చీరనడల్పఁగఁ డంగి రొంటిపై
దురితము నాక యట్టి కురుధూర్తుల నూర్వుర నన్నదమ్ములన్
వరుసగ నస్మదీయగద పాలొనరించిన నేను భీముఁడన్.

అర్జు—బళే! అన్నా! భీమన్నా! మఱి నా ప్రతిజ్ఞ యిదె యాలకింపుము.

మ. కురుసుతు నొద్దఁ జేరి తన తుంగల పాండితి యెల్లఁ జూపి యే
వుర మనలం దొలంపఁ బలుపోకలఁ బోయెడు కర్ణుఁ గిట్టు యా
పరశుధరుండు భూసతియు బ్రాహ్మణపుంగవు లిచ్చినట్టి శా
పరనము లూఁతగాఁ బుడమి పాలొనరింపక యర్జునుండనే.

ధర్మ—శ్రీకృష్ణభగవానుండు సర్వదా మన పంతములం జెల్లించును గాక.

నకులసహదేవులు—(ఏకకంఠ్యముగ) అన్నలార! మా ప్రతిజ్ఞలను వినఁగోరెదము.

చ. అతఁ డొనరించునట్టిది సహాయమె యైనను దోషదూషితం
బతికఠినస్వభావయుత మాటను భ్రాతలు నల్గురు న్హితుల్
కృతపడ నీకుఁ దోఁచదిట నేగుమటంచని యుల్లసంబుగా
మతిఁ గరగించి యా శకుని మామను ద్రుంతుము మీరు సాక్షిగన్.

ద్రౌప—అపుడు నాపరాభవానలము చల్లాఱిన దనుకొందును.

పాండవు లైదుగురును—ఇంకను సందేహపడుచుంటివా!

(అంతట గుంతి ప్రవేశించుచున్నది.)

కుంతి—(ప్రవేశించి) నాయన్నలార! ఇంతదాఁక నా విచారము నే చేయుచున్నా
రా. వనవాసమున నొక్క గడియ గడచినను గడచినదే యనుకొనుచున్న దానను.

ధర్మ—నీయభిప్రాయమున కన్యథా కావించువారము కాము.

ద్రౌప—(అత్త సమీపమునకు వచ్చి దీనముగ) నీపుత్రు లేవురు వనికేగుచుండ వారి ప్రతి
బింబములను నీయొద్దఁ బెట్టితిని. కాన నాకు విచారము లేదు.

కుంతి—వెఱ్ఱికోడల! తల్లివంటి దాన నెన్నఁడును గాకున్నను నేమియు నపాయము రాకుండఁ గాపాడెదను.

ధర్మ—అమ్మా! ఇంక మాకు సెలవొసఁగుము. (ద్రౌపదితో) ప్రాణేశ్వరీ! పదపద!

కుంతి—నాబిడ్డలార పోయిరండు. తాపససహవాసమున మిమ్ము మీరు మఱచిపోకుఁడు.

ధర్మ—తల్లీ! ఇప్పుడంతటి వారమగుటకు శాంతి యెక్కడ.

భీమ—జననీ! నన్ననుగ్రహించి వనవాససుఖ మనుభవింపఁబంపుము.

కుంతి—తండ్రులార! పోయిరండు.

ధర్మ—అమ్మా! నీమనముల క్షేమ మారయుటకై నడుమనడుమ—

గీ. బ్రహ్మచారులట్లు ◆ వ్రతనిష్ఠు లట్లువే దాంతులట్లు నీదు ◆ నంతికమున
కరుగుదెంచుచుండు ◆ రాటవికులు వారి, నరసియుచటివార్త ◆ లంపుమమ్మ.

కుంతి—ఇదియును నాకుఁ జెప్పవలయునా. పోయిరండు. సుఖులరై పోయిరండు.

అర్జు—సర్వజ్ఞుఁడైన కృష్ణున కిది తెలుపనక్కఱలేదు గాని ప్రపంచధర్మముగ నెవ్వరితోనైన వార్తయంపుము. నాకనుజ్ఞ యొసఁగుము.

కుంతి—అట్లే కావించెదను. పోయిరండు.

సహ, నకు—అమ్మా! అన్నలతోఁ బోవ మాకు ననుజ్ఞయిమ్ము.

కుంతి—(దుఃఖముతో) బిడ్డలార! మీయమ్మను నేను గాను. మీయమ్మయే యున్న నిర్భాగ్యురాలనగు నావలెఁ గొడుకుల నడవికంపు కొనునా. (అని కౌఁగిలించుకొని కన్నులు తుడిచికొని) నాతండ్రులార! పోయిరండు.

నకు, సహ—(దీనులై ధర్మరాజునొద్దికిఁ జని నిలుచుచున్నారు)

ధర్మ—(పట్టుకొని) ఈమాటలతోనే విడిచిపెట్టిన దనుకొంటిరా. వగవకుఁడు. మన కామె యెక్కడనున్నను బెనుప్రాపగుచుండును.

(తెరలోఁ గలకలము)

ధర్మ—(ఆలకించి) అమ్మా! నీవుచనవలయును. చూడఁగా నీకలకలము మాస్థితికై వగచు ప్రజలదై యుండనోపును. వారి నోదార్చి త్వరితముగ మేమేగవలయును.

కుంతి—(కన్నీటిం దుడుచుకొనుచు) హా! నాబిడ్డలార! సుఖులై పోయిరండు.

(అని నిష్క్రమించుచున్నది)

(మరలఁ దెరలోఁ గలకలము.)

ధర్మ—(ఆలకించి) ఓపౌరులార! ఏమిది? అపచారము చేయవలదు. ఏమియు నాటోపము వలదు. (విని) బాగు బాగు! మీకు వనవాస క్లేశమేల.

గీ. ప్రజలయనురాగ మెప్పుడు రాష్ట్రమందు, నిల్పవలయును పెక్కురు నేలరేంద్రు
చనరె బహుచక్రవర్తుల శాశ్వతములు, తనువు లేనెంతవాఁడ మీ తలఁపువిడుఁడు.

(తెరలో మరలఁ గలకలము)

ధర్మ—మీయభిమానము నాకు విఘ్నకారి యగుచున్నది. నిక్కముగ నాపై ననురాగము గలదేని నాయీమాట మీరు వినవలయును.

శా. జనపతి తోలువాఁడును బ్రజల్ వృషభంబులు భూమిబండికిం
పున నయమార్గమందయిన ముందటిసూతుఁడు గాక తొట్టెలోఁ
గనఁబడ వింతవాఁ డదరఁ గట్టులు పుట్టుల వీడ్చునెద్దులం
దున శకటంబు ముక్కలగుఁ దోడనఁ జోదకుఁ డీలుఁగుం గదా!

ఓప్రియమైన పౌరులార! అంతటితోఁ బోదు ఆక్రొత్తవాఁ డెద్దులం బట్టి-

గీ. భయముదీర్ప శీక పడియున్న బండిని, దిరుగదీయలేక తిట్టుకొనుచు
మోదెనేని తెచ్చి ముందటికంటెను, పశువుగాను మొదటి వానికైన.

ఈయర్థముం జక్కఁగా గ్రహింపుఁడు. మీవలన రాజ్యమునకే కాదు, నాకును భవిష్యత్తునందు హానియున్నది. నాకడ్డురావలదు. నాబోధను వినవలయును.

(అని యంజలితో నిష్క్రమించుచున్నాఁడు)

ఇది షష్టాంకము.



శ్రీమదుమారమణాయనమః

# దుర్యోధనాభిమానము.

## సప్తమాంకము.

(అంతట కృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు)

కృష్ణు—అర్జునదుర్యోధను లిద్దఱు నొక్కనాఁడె యీద్వారకకు వచ్చినారఁట. వచ్చుటకు గారణము నన్ను యుద్ధములో సహాయము చేయఁ గోరుటకై యున్నది. ఏమి జరుగునో చూచుటకై నేనీ శయ్యపై నిద్రించువాఁడవలె యుందును, నాతల యంపి నొకపీఠమును గాళ్లకడ నొక్క యాసనమును గలవు. ఎవ్వరెవ్వరెట్లాసీను లగుదురో యెవరిహృదయము లెట్లున్నవో దీనివలన దెలిసెదను. (అని నిద్రనభినయించుచున్నాఁడు)

దుర్యో—(ప్రవేశించి) ఈతఁడు నిద్రించుచున్నాఁడు. లేచువఱకును బలరాముని యింటనో కృతవర్మగృహంబుననో యుండి వత్తమన్నను నేఁడే యర్జునుండును గృష్ణదర్శనమునకై వచ్చినట్లు తెలిసినది. కాన నేనిక్కడనే యుండెద. ఇచ్చట రెండుపీఠములు పెట్టఁబడియున్నవి. ఇంతవఱకుఁ బడుచున్న యవమానము సహించి నిరభిమానివలె నున్నను సాగినపు డేల విడువవలయును. రాజాధిరాజను గాఁబోవు నేనీ శిరఃపార్శ్వమునందే యుపవిష్టుఁడనయ్యెదను. (అని కూర్చుండును.)

అర్జు—(వినయముగఁ బ్రవేశించి నమస్కరించి) ఇది నిదురించువానికి మ్రొక్కుటవంటిది గాదు.

గీ. అఖిలభువననియామకుం•డైనవారికి, నిద్ర కెడమేది యెపుడు ని•ర్నిద్రవతిరె
భక్తపాలనపరత న•వ్యక్తుఁ డయ్యె, నిక్కముగ స్వీకరించు నా•మ్రొక్కు లిపుడు.

(చూచి తనలో) నాకంటె సుయోధనుఁడు మున్నుగ వచ్చియున్నాఁడు.

గీ. బంధువని బావయంచని•పరమపురుషు, నెడల నాలస్యమొనరించి•చెడితి మేము
ముందు వచ్చినవారికె•ముఖ్యముగను, తోడు చూపుట న్యాయ్యమెం•దులకునైన.

కాని మ్రోపాదములవైపున నున్న పీఠముపైఁ గూర్చుండి లేవగనే కనఁబడియెదను. (అని కూర్చుండును.)

కృష్ణు—(మేల్కాంచుట నభినయించి) అర్జునా! ఎల్లవారు సుఖులే కదా! నీవెపుడు వచ్చితివి?

అర్జు—(చేతులు మొగిడ్చి) భగవత్కారుణాకటాక్షమున నందఱుం గుశలము. ఒక ము
హూర్తకాలమయి దేవర పాదమూలముం జేరితిని.
దుర్యో—ఈతని కొక్కింత ముందుగనే నేను వచ్చియుంటిని.
కృష్ణు—(తిరిగి చూచి) ఓహో! సుయోధన! క్షేమమె కదా! రాజరాజు సుఖియే!
దుర్యో—(తనలో) తన్నుం బరిభవింపఁబోయితినని యొగతాళి కాదుగద యిది.
(ప్రకాశముగ) నీదయచే నెల్ల వారికిం గుశలము.
కృష్ణు—చ. అరమరలేక మీరలిటు • లైక్యమతి న్ననుఁ జూడవచ్చుటం
బరమహితంబు నాకుఁ • బెఱవారలపోలిక నన్నదమ్ములు
ద్ధురులయి వాదులాడుటని • దోషము వెన్కటి పన్ని కార్యముల్
మరలఁ దలంపకుండుఁడు స • మస్తజను ల్సుఖియింత్రు మీగతిన్.
దుర్యో—అది యట్టిద కాని మాకు సంధి పొసఁగలేదు. అచ్యుతా!
చ. తెలిసియు తెల్వి లేమినొ వి • ధింగడు వంగను శక్తి లేకయో
పలువురు స్నేహరీతిఁ బ్రి • తిబంధము చేయుటనుంటనో యటు
ల్లలిపితి నద్ది వారలకు • జన్మశతంబులకైన మానసం
బుల విడఁజాల దట్టి యెడఁ • బోరుఘటిల్లక సంధి యెట్లగున్.
అర్జు—సంధి చేయవచ్చినవారి మాటలు వినినఁ బొసఁగకపోవునా!
గీ. కర్ణుమాటలట్లు • కర్ణరంజకములు, పరులవయ్యె నేని • జరగకేమి
తండ్రి లేదు దైవ • తంబును లేదు న, సేమిరా యటన్న • నేమిసాగు.
కృష్ణు—ఎట్లు! మీరిరువురును సఖ్యముగ నాయొద్దికిం జెప్పవచ్చిరని తలంచి సంతసిం
చుచుంటిని.
దుర్యో—విధిబలీయ మగుటచే మీవంటివారిమాట వింటిమి మఱటివను గౌరవము మా
కుఁ గలుగలేదు.
కృష్ణ—సుయోధన! నీవు చెప్పినది సమంజసముగా లేదు. నీవు వారియెడల నొనర్చిన
వి నీమనస్సున కెగ్గులనియే తోఁచియుండును. పాండవులకు మాత్ర మట్టితలంపులే
దు. పరులు కూడ నిన్నెగ్గు చేయుచున్నాఁడ వని దూషింప మొదలిడిరి గాని వారు
నీసహవాసదోషమునకు ఫల మిదియని వగచుచున్నారు. మనసా నీపై వారికిఁ గ్రోధ
ములేదు. ఈమాటలు సుదృఢం బనుట కొకటిరెండు మాటలు చెప్పెదను వినుము:—
మ. అనుఁగు నిన్మిత్రులబోధమీఁదట నర • ణ్యావాసులం గేలిసే
యను మీ రేగిరి నాఁడు లోఁపడిరి దై • న్యంబందు; వారేవురు

న్నవమం దెట్లు తలంచిరో కనుము గంధర్వాళినోడించి ని
న్నను నీవారిని నుద్ధరించిరది యెందుఁ గ్రోధకృత్యంబొకో ?

మఱియు నేకళనుండి యట్లు కావించిరో గాని మాపై వారికి జన్మశతంబులకైన విడువ రాని వైరముండినయందు వేని—

ఉ. వైరులు చేయు కార్యమెది ? వారివధించుటె యాఁగదా సదా
మీరలు చేతఁజిక్కి మిసిమింతులు గాకను జంపకుందురే
యూరక మోహనాస్త్రమున నుర్విఁబడం దలగోయఁజాలరే
చీరలు కోసి తెత్తురె సహించుము వారికిఁ గ్రోధ మెక్కడో !

ఇంకొక్కటి యాలింపుము—

క. నను నాఁడు సంధిసేయుం, జనుదెంచినఁ గట్టివేయ నమకట్టిరి నే
ననవనె మిము ఖండింపనె, కనకుండినఁ గ్రోధరహితగతి వారియెడన్.

పాండుసుతులకేక్రోశమందును నీపై నసూయ లేదు. ఇప్పటియుద్ధమైనను నీవు వారికిం బాలీనికారణమున దానిని రాఁబట్టుకొనుటకై కాని మిమ్ముఁ జంపవలెనని యెంతమాత్రమును గాదు.

దుర్యో—వాసుదేవ ! జ్ఞాతిగుట్టు నరఁటికట్టును విడువవందురు.

కృష్ణ—పరులమాటలతో నేమి ప్రత్యక్షముగ నీవిషయములో నెట్లున్నదో చూడరాదా ! అభిమన్యుని పెండ్లిలో నీమాట పుట్టినపుడు విరాటుపురోహితు సంధిమాట లాడఁ బంపునపుడె నేనువలంచితిని. నాతలంపున కన్నగారు విముఖులగుటచే నోండాడలేక నేన వచ్చితిని.

ఉ. మించినదేమి మీకు మఱి మీకును సఖ్యము గూర్చెదన్ననుం
బంచిన భూమిలోసగము పాలనుమాటయు లేదు తోఁచిన
క్లైంచి యొసంగు మంతయుని యింతయుటంచను వాదులేదు వా
రించుకయేని యొండవక యిష్టపడంగల రేనుజెప్పినన్.

సుయోధన ! మఱియొక్కటి యాలోచింపుము. యుద్ధమున నెవ్వరు నొవ్వకుండఁ జావకుండ జయము రాదు.

శా. పాలీయుండ రణంబొనర్చినను సంబంధుల్ ప్రపుత్త్రహితుల్
నేలంగూలెద రంతఁ బాడుపుడమి న్నీవేమి వారేమి యే
లీలం బాలనసేయ సంతసము గల్గించుం జగంబెందునం
జాలున్మానిసి మిత్రుఁడాశ్రితుఁడు సేనల్సేవకుల్నిచ్చోన్.

గీ. ధనముపోయినఁ గ్రమ్మఱ•ధనమువచ్చు, బలముపోయినఁ బదపడి•బలమువచ్చుఁ
బ్రాణములుపోయెనేని నె•వ్వరికినైన, రావనుచుఁ బోరఁగా ధర్మ•రాజు వెఱచు.

అది నిజమైనదియే.

ఉ. నీవిడకున్న లేఱయుప•నింగడియింతురు వారలేవురన్
వేవురుగూడి రేని నినుఁ•బిల్కువఁ జేసినఁ జేసనార్థులే
నీవు నదేతలంపు మన•నింబడఁ బార్థులఁ జేసి తెత్తువే
రేపవగఁ బ్రాణహానికి సం•హింతురె రోగులు వృద్ధులేనియున్.

ధర్మశాస్త్రములలోఁ గూడ నిట్లుండును—

ఉ. కప్పను పాముపట్టిన నొ•కానొకపోరము వెట్టి దానిచేఁ
గప్పఁ దొలంపనొప్పు నుర•గంబును జావదుఁ గప్పచావదున్
గప్పలు పాముమేఁతకె జ•గంబునఁ బుట్టినవంచు నెంచినన్
దప్పగుఁ బ్రాణరక్షణ వి•ధంబులనేకగతిం గనంబడున్.

రాజులు శాస్త్రములు చదివియును రాజనగుణాధిక్యముచే వీనిందలంపరు. ధర్మజుండెత్తినది క్షత్రియజన్మమైనను నితరరాజులవంటివాఁడు కాఁడు. ఎల్లవారు సుఖులైయుండవలయుఁ దమకు నైశ్వర్యాభివృద్ధికావలయుఁ ననికోరును. పరులకు సుఖదంబులైన యైశ్వర్యంబులఁ దృణీకరించును.

గీ. అతనిహృదయంబు వేఱువే•ఱతనిసోద, రులదని తలంపకుము యేవు•రును సమాను
లందు సందేహ మనుచు నా•వంతలేదు, కలిగినను నాదుమాటకుఁ•గట్టువడరె!

అర్జు—కృష్ణ! ఒకరిచేఁ జెప్పించుకొనుట మాలో మాకుఁ గూడదనియే యెల్లపుడుఁ దలంతుము. అట్టిచో నీవుచెప్పినపుడు ప్రాణములు పోవు పనియైనను మాఱువలకుదుమా!

దుర్యో—(ఆలోచించి) మాధవ నీవుచెప్పినది వాస్తవమే కాని—విరోధించి—

గీ. మరలసఖ్యంబుసేయను నా•మనసురాదు, లోకనిందకుఁ బాలౌదు•నీకటాక్ష
మెట్టులుండిన నట్లగు•నింతవఱకు, సర్వసన్నాహమయ్యెను•సమరమునకు.

కృష్ణ—నీవువెఱ్ఱివాఁడవు. విరోధించి కూడిన వారులేరా సన్నాహపడినను యుద్ధము మానుట మేలుకాదా! జనులుసుఖింతురు. మీయిరువురిలోఁ బూర్ణముగ విరోధమే లేదు. వారెట్లయిన నీతోసఖ్యపడనే మనసుపడుచున్నారు.

దుర్యో—నారాయణ! నామనసుమాత్రము మరలుటలేదు.

గీ. నీసహాయంబుఁగోరుచు•నీసమీప, మునకువచ్చితిఁ బార్థుఁడు•వెనుకవచ్చె
నెవరిపైనీకుదయయున్న•నవధరింపు, వారిపక్షుఁబు సంధికి•వలను లేదు.
కృష్ణు—నీకువలనులేదేమోకాని సంధికి వలనుగలదు. తలంపుండినచెట్లయినఁ గావింప వచ్చును.
గీ. ఎఱిఁగి యూరకయుండుట•హితము గాక, పల్కుచున్నాఁడఁజెడనాడ•వలదులెస్స
యోజనయొనర్చి చెప్పు మీ•వొకటి రెండు, నాళ్ళలోపలనే జన•నాశమేల.
నీవు నాకంటెఁ జిన్నవాఁడగుటచే నొత్తి పల్కుచున్నాను.
చ. ఒడఁబడితేని సంధికి మ•హోచ్చగతిన్నను రాజుఁజేసియే
ల్బడికి నకంటకంబుగను•బాండవులం బయిగాపువెట్టి భీ
ష్ముఁడు గురుఁడు న్యధిష్ఠిరుఁడు•నూరెల నీకనువైనమార్గము
ల్నుడువుచునుండ నేనును న•నూనమతిం బరికించుచుండెదన్.
దుర్యో—(తనలో) ఆదినాకవమానకరము గాదా! నేను నాతమ్ములు నంతయంచేదలమా. (ప్రకాశముగ)
ఉ. ఓడితి నేను మంచి విన•నొల్లక నాసిలినట్టివారితో
వాదుకవత్తునేను బెఱ•వారలు నన్విని యట్లచేయఁబో
రోడకయుండ నాతెరమె•కోయది పట్టిది వట్టిమాటయే
గోడును లేకయుండునటు•కుంతికుమారులఁ బ్రోవు మాధవా!
అర్జు—మేము జీవించియుండి యనుభవించునది యేమి.
గీ. ఇతఁడు మనవాఁడుభాగ్యమెం•తేనిగలఁడ, టంచుగనుఁగొనియానంద•మందు బంధు
లాప్తు లెందును లేకున్న•యతని వైభ, వంబదేటికి జీవచ్ఛ•వంబువాఁడు.
కృష్ణు—అర్జునా! ఇఁకఁ దెలిసినది. నిర్బంధించినను వినినట్లు లేదు. ఈతని కనిష్టము గు నీప్రసంగముం గట్టిపెట్టిన మేలు. (దుర్యోధనునితో)
ఉ. భూమిభరంబు దీర్చుటకుఁ•బోరొకఁ డౌనని యాలకించితిన్
నామది నంతనుండియును బెం•నం గొనె మీదువివాదక్షేమము
గ్గోమగు రాజపుత్రులను•లోకము గోరును దుష్టశిక్షకై
వేమఱుఁ జెప్పిన న్విడువ•వేగద నీపెను వెఱ్ఱికౌరవా!
ఇపుడు నీయభిప్రాయమేమి?
దుర్యో—నాపక్షమున రణంబునకుఁ దోడు రమ్మనుటయే.
కృష్ణు—ఇదివరకు నొక్కసారి వచ్చి యడుగుచుండ నేమియుం దోఁచుట లేదు.

దుర్యో— ముందు నేను వచ్చియుంటిఁ గాన నాపక్షమున వచ్చుట న్యాయము.
కృష్ణు— నీవే ముందు వచ్చియుండుదువు గాని పార్థుఁడు ముందగపడెను. అదియట్లుండనిమ్ము.
ఉ. అన్నియు జెప్పిన న్వినని యూతనిపక్షము వోయి చూచుచుం
డన్నము లందనేల; మును వచ్చినవారిని మాని పార్థులం
దున్నలువం జగంబునను దోషిగ నెంచును; మిత్రులంచు నే
నిన్నిదినాలనుండి యిపు డేగకయుండిన వారు నవ్వరే.
ఇంతకంటెను ముఖ్య మొక్కటి గలదు.
గీ. ఏను పాండవపక్షము నెల్లజనులుఁ, బల్కుదురు నన్ను గౌరవుని పక్షమంచు
విదితమేగద యట్టిచోఁ గదనమునను, ముందు మాయిద్దఱికివచ్చుఁ బోరునిజము.
కావున నేనును నన్నగారివలె నెవ్వరిపక్షమునను రాను. వచ్చినను నాయుధముపట్టను.
వలసినని పదివేలు నారాయణగోపాలురను నాబలముండీసికొమ్ము. అర్జునా! ర
ణధర్మముంబట్టి ముందువచ్చిన వారికిఁ దోడ్పడుట న్యాయము. ధర్మరాజా నీవివ
యమున నన్నుక్షమింపఁ బ్రార్థింపుము.
దుర్యో— శుద్ధబుద్ధస్వరూపముగల దైవము వచ్చినను బ్రయోజనమేమి. ఏమూకయో
సేనయుండుటమంచిది. (ప్రకాశముగ) మాధవా! యిదినాయెడలఁ బ్రసాదము.
నాకు సెలవిమ్ము.
కృష్ణు— నాయందాగ్రహమువలదు. మీయయ్యగారిని సమాధానపఱపవలెను.
దుర్యో— దీనికాగ్రహమేల. (నిష్క్రమించుచున్నాఁడు.)
అర్జు— కృష్ణా! నినొల్లనని పల్కుటతగదు ప్రతిజ్ఞాభంగము చేసికొమ్మనుటకు నేనెంత
టివాడను
గీ. నీవు నిలిచి యున్న నెలవున జయమొందు, వలదు రణము నీకు వచ్చి నాకు
నూఁతగాఁగ నిలువు యుద్ధప్రవీణుల, మేము గలుగ నీకు నేటి కయ్య.
ఉ. నీవటు చేతనే కదము నిప్రకరంబులు మెచ్చగాఁ దపం
బాదటఁ జేయ నిందుఁడు భయంపడి నన్గొనిపోయి స్వర్గము
త్యాదరుఁడై యొసంగె వివిధాయుధము ల్నరు లెవ్వరేనియుఁ గ
న్నొదగు బ్రాపులేక చని నేస్తురె స్వర్గము మానుషాకృతిన్.
ఉ. నీకరుణాకటాక్షమున నేగిన శంకరునంతవానితో
డీకొని బల్మి చూపినఁ గడిందిగ నాపయి మేలుచూపి గౌ
రీ కమలాక్షితోడను గిరీటి చుమా యిత డంచుఁ జెప్పియ
స్తోకమదంబున న్నిపుణి ఘోనపాశుపతాదు లిచ్చుటల్.

ఉ. ఈగతి నీకృపారసము నీశ్వరు సత్కరుణామరందమా
యాగభుగీశ్వరాత్తము దయామృతముం గడుపార గ్రోలి నే
నేగతిఁ గూల్పలేనొ రిపుబృందము నీవటు చూచుచుండుమా
సంగరణంబునందు బలసారము లెవ్వరి పెట్టులుండునో.

అచ్యుతా! నీవాయుధము ముట్టననుటచే సంతసమే కలిగినది. కాని—

శా. నాపైఁ గల్గిన వత్సలత్వమునఁ గర్ణప్రౌఢికిం గూర్చెఁ దా
శాపంబుల్ గవచంబుఁ గుండలములుం జిష్ణుదేవ రూపంబునన్
బాపెన్ శక్రుఁడు కర్ణుఁ ద్రుంచుట తృణప్రాయంబు నాకిప్పు డా
నాపూర్ణప్రతిభాఢ్యు మార్కొనమికిన్ బ్రాప్తించు దుఃఖాశ్రువుల్.

కృష్ణ—ఏమి! కర్ణుఁ డెంతవాఁడో నీవెఱుఁగవు. ఇప్పటి స్థితిలో నీవు గెల్చుకొనినఁ బూర్ణప్రతిభావంతుం గెల్చినట్లె సంతసింపవచ్చును. దుర్యోధనపక్షమునం గల వారిసంగతి దేవరవాక్యమైనం జెప్పుచున్నాఁడను.

చ. తొలి పదినాళ్లు భీష్ముఁడును ద్రోణుఁడు పిమ్మట నైదునాళ్లు నా
వల దివసద్వయంబు బలవంతుఁడు కర్ణుఁడు మీఁదినాఁడు శే
షిలిన బలంబు రాజును నిశీథమునందును బోరుచేయుఁగాఁ
గలరెటు కాచుకొందువొ ఏకస్వరధైర్యత నప్రమాదివై.

అర్జు—పదునెనిమిది నాళ్లయుద్ధమా!

కృష్ణ—పార్థ!

చ. తెలిసినదే కదా మహిమ దేవనిభుండగు భీష్ముఁ గూర్చి యీ
యిలఁ గల శూరశేఖరుల కెల్ల గురుండు గురుం డటంచుఁ గ
ర్ణులసిత తేజమన్న వరుణుండె సముద్భవమైనయట్లుగా
దలఁపుము సైంధవుండు పితృవత్తవరుం డని నీవెఱుంగవో.

గీ. కృపుఁడు కృతవర్మ శల్యుండుఁ గీర్తనీయు, బలులు సౌబలుఁ డసవృషసేనుఁ డతులశౌర్యు,
సోమదత్తుండు బాహ్లికుఁ డామహోద, యుండు భూరిశ్రవసుఁ డసాధ్యుండు బలిమి.

గీ. ఎందఱెందఱు సాము మైయేగుదెంతు, రోమహీశులు వారికే భూమివారొ
మఱచినార మశ్వత్థామ మాట యతఁడు, ద్రోణపుత్రుండు తలఁపరుద్రునకు సాటి.

మఱియుఁ గామక్రోధముల యేకత్వమునఁ బ్రభవించినవాఁడు.

అర్జు—అనంతా! ఇపుడు నాకీ పిఱికిమందు వోసి కలంపకుము.

కృష్ణ—ఇది భద్రముగా నుండుమని చెప్పుటగాని భయపెట్టుటఁ గాదు. సుయోధను నిఁకలె రణంబుడుగు మనుటకును గాదు.

అర్జు—నీవొద్దనిల్చి నావీరవిహారముఁ జిత్తగింతువుగాక!

కృష్ణ—యుద్ధమున నీతోఁ దిరుగుచుండనా! అదియెట్లుపొసఁగును.

అర్జు—రథముపై ప్రక్కనుగూర్చుండి యూరయుచుండిన నీప్రతిజ్ఞకు భంగమగునా?

కృష్ణ—లేదుగాని యప్పుడపుడు నీకుఁ జెప్పఁదలఁచిన మాటలకు సూతుఁడడ్డువచ్చునేమో.

అర్జు—అట్లయిన సూతుని మాన్పి నేనే రథమును నడపుచుండుదును.

కృష్ణ—(ఆలోచించి) సూతకృత్యమాయుధరహితముగనుక నేనే యాపనిం గావించెదను.

అర్జు—ఇఁక నేమి! త్రిలోకములంజయించెదను. అప్పుడు నాకీకౌరవసేనయెంత. కౌరవులెంత? పైవారింగూర్చి వెఱపులేదు. ఏమందువా! భీష్మునికై శిఖండియుం, ద్రోణునికై దృష్టద్యుమ్నుఁడును, కర్ణునికి నేనును, శకునికై కవలును, దుర్యోధనాది భ్రాతృశతమునకు భీముఁడును శల్యునకు ధర్మరాజును గాచియుందురు. తక్కినవారి నప్పటి కప్పుడు పోలినట్లు చూచుకొందుము. సంశప్తకుల, సింధురాజును నెక్కుడుగా నామనమునఁ బడవైచికొందును.

కృష్ణ—మఱియెవ్వరిం బిలువఁ దలఁచినవారికై పోయిరమ్ము. నేనప్పటికి వచ్చెదను.

అర్జు—ఇంకనెవ్వరిం బిలువను. వారిదెసకుఁ బదునొకండక్షౌహిణులును మాదెసకేడక్షౌహిణులును జేరువఱకుఁ గష్టమైనది.

కృష్ణ—కావున నేమన మప్రమాదులమై యుండవలయును. మాయన్నగారెందును జేరక తటస్థులైయున్న కతన మీకంత యేసేవచాలును. (ఆకాశముచూచి) ప్రొద్దులేదు. రారమ్ము. అవసరపరిచ్ఛన్నములు గావింతము.

(అనినిష్క్రమించుచున్నారు)

(అంతట తొడలు విఱిగిన దుర్యోధనునియొద్దఁ గృష్ణుఁడు, ధర్మరాజును బరివేష్టించుచున్నారు)

ధర్మ—దుర్యోధన! నీపంతము నెగ్గినదా! ఇదియంతయు నీసహవాసదోషమునకు ఫలమని నమ్ముము.

కృష్ణ—యుధిష్ఠిరా! నేనీతనితో ద్వారకవచ్చినపుడు—

చ. చిలుకకుఁ జెప్పినట్టులు వచింపరు చింప వదేమిపాపమో
చిలుకలపల్కులట్టులు విశేషము లేకయ వ్యర్థమయ్యెనా

పలుకులు ; పాలుమాట భగవంతుఁ డెఱుంగను బోరుమానుమా
వలనిఁక నీదు చిత్తమును వారలభాగ్యమునందు వేఁడితిన్.

దుర్యో—లోకమునం దెవ్వరిప్రతిజ్ఞ వారు చెల్లించుకొనుట మంచిదని నాయభిప్రాయము.

ధర్మ—అన్యాయమునందును బ్రతిజ్ఞయేనా !

కృష్ణ—ఆహా ! తనకుఁ దోఁచినదే కాని పెద్దలమాట వినరాదని శాసనము చేసి పోవుచున్నాఁడయ్యా !

దుర్యో—(తొడలు తాఁకికొని యుస్సురనుచున్నాఁడు)

ధర్మ—(దుఃఖముతో) తమ్ముఁడా ! మొదటినుండియుఁ జలపాడివైతివి గదా ! ఇది చూడఁగా–

మ. మదిమాత్సైఁ గలయీర్ష్యనుచు వచియింపం బనిజాలఁ జూపోపకా
మును నల్లుక్ గనులేనివారి మదియుం బ్రాక్ ఘోరదుఃఖాబ్ధిఁ గ్రోఁ
బొవలింపంగఁ దలంచి కావలయుఁ ; నెంపుఘ్నదు మాటన్న వా
రెమరాడంగ నసహ్యులైరె యిదియేమీ దీర్ఘకోపంబయో !

కృష్ణ—సరియే. నీవనినట్లే లోకమునందు–

ఉ. ఎవ్వరు నీమశాసనము నెంచుకయేనియు దాఁటకుండఁ దా
మెవ్వరు చెప్పిన న్వినక యేచరియించిన నిన్నుఁబోలె వా
రివ్విధినే ఫలంబు గడియింపఁగవచ్చును గాదె యేదిని
వెవ్వరిఁబాటి సేయక యహీనపుఁ బంతము నిర్వహించితే.

దుర్యో—భీముదుష్టగదాఘాతమున బాధింపఁబడు నన్ను రేపి మీరుల్లసంబాడుట చేయుమ్ము నేను మూలనాడవలసివచ్చుచున్నది.

ధర్మ—వెఱ్ఱితమ్ముఁడ ! ఎన్నఁడు నీవు మమ్ము గౌరవించినావు. మాకా భయము లేదు. నేఁడైన మన మిరువురముఁ జాలసేపు సంభాషింతము.

కృష్ణ—ఏమి ! కష్టరికం బెఁ జెడిపోయినామా ! మనమాట యొక్కటి వినిన నింతవఱకు రాదు.

దుర్యో—నాపంతము నేను న్యాయముగ నెగ్గించుకొంటిని. అతఁ డంతయు నన్యాయము చేసెను.

కృష్ణ—ఏది మా యన్యాయముం గొంత చెప్పుము. ముందు జాగ్రత్తగా నుందుము. కృష్ణుఁడు వచ్చెనని ద్రౌపదిం బిలిచి రజస్వలం బరిభవించుట మీది న్యాయమే కదా !

దుర్యో—గౌరవముగాఁ బిలిచిన నన్నుఁ దప్పించుకొని హీనకార్యమైనను బాధ్యనకు సూతకృత్యము చేయుటకు నీది యెుదటి న్యాయమేకదా!

కృష్ణ—దుర్యోధన!

మ. అది నేఁ జేయుచుంటినో యెుదటన్ వైరియేల నన్గోరవో
కదనం బన్నను వీఁడు భీతిలియె నిక్కంబేల నాకంచు నీ
మది నూహించితి మాటకైన నను రమ్మన్నయుంటె వేకొంటివా
పదివేలుం బలుఁగంబుఁ జాలు నిటు చావంబోవుచుం దూషణల్.

ధర్మ—భూశయనము చేసినప్పుడుఁ గూడ నారచూపినఁ బీచను మూర్ఖునివలె నీపలుకు ట నాకు దుఃఖముం గలిగించుచున్నది. ఏదీ, మారెండవయన్యాయము.

దుర్యో—అంతయు నన్యాయమే. మీరే కాదు, నావారు నన్న న్యాయము చేసినారు.

కృష్ణ—అది యెట్లో! ఆస్వామిద్రోహు లెవ్వరు చెప్పుమా!

దుర్యో—ఎవ్వరా! నారాజులుఁడు ధర్మరాజు నను నట్లే తీయుతీయని పేరులు గలవారె.

కృష్ణ—గుణము కనఁబడవలయు గాని పుట్టుకతో వచ్చినపేరు లానరునకుఁ దోడుపడు ను. అట్లయిన నేదీ మీదుర్యోధనసుయోధన దుశ్శాసనాది నామముల పౌరుషము?

దుర్యో—మ. తనగుట్టంతయు నిచ్చె భీష్ముఁ డటులీధర్మస్వరూపుండు వేఁ
డిన ద్రోణుండును వైదికంబు విడకుండెన్ శల్యుఁడో పాండునం
దనపక్షంబయి పార్థుఁ గూర్చి యలయింద్రస్వామి యట్లేర్చి క
ర్ణుని ద్రుంగించెను, భీము న్యాయమున నేనుంగూలితిన్ భూమిపై.

ధర్మ—తమ్ముఁడా నామాట వినుము.

ఉ. ఏగతి నెందఱెందఱో మహీశులు బంధువు లాప్తులు న్నినుం
బాగుపడంగ జెప్పిన సెబాసవి యన్నియునీకు నచ్చవే
యోగయినంజగంబునను యోగ్యులునుం బదిమంది సెప్పిరే
నాగతి మానుటొప్పదె వినన్సహియింపవుగాక యెప్పుడున్.

కృష్ణ—అంవటి వీరుఁన నన్ని దోషములుఁ గనఁబఱచినాఁడు గాని కర్ణుఁ డొక్కఁడె యీయనకునిర్దోషిగా నున్నట్లున్నది.

దుర్యో—నిశ్చయముగ స్నేహితుఁడైనను బంధువైనను గర్ణుఁడే. కాని యాతనికి న న్ను గెల్పించవలెనని యున్న నింద్రునకుఁ గవచకుండలము లిచ్చివేయునా యని యొకసందేహము పుణ్యమో పాపమో తోఁచుచున్నది.

కృష్ణ—ఇఁక శకుని యొక్కఁడున్నాఁడు. ఇతఁ డెట్టివాఁడో.
ధర్మ—"సర్వనాశాయమాతులః" యని పెద్దలు చెప్పుదురు గదా!
దుర్యో—ఆతఁడు నాకేమి యెగ్గు చేసినాఁడో గ్రహింపఁజాలను.
శకుని—(జీఁకటి క్రమ్మించి పిశాచాకారముగ నాకాశమున నిల్చి పెల్లని స్వరముతో) ఓ దుర్యోధన! ఓ కృష్ణ! ఓ ధర్మరాజ! మీ సందేహమును విడఁజెప్పుచున్నాఁడను. ద్వాపరము మాఱుటయుఁ గలి ప్రవేశింపఁ బోవుటయు మీకుఁ దెలిసినదియే కదా! భూదేవి నాభారమును మాన్పుమని బ్రహ్మను బ్రార్థించుట విన్నారు గద! అందులకని మనమందరమును భూమిం బుట్టితిమి. గాంధారిపైఁ గ్రోధమున మాతండ్రిం జంపవచ్చి యీ దుర్యోధనుఁడు మాయన్నల నూర్వుర నిద్రించు వారిం గడపినాఁడు. తపశ్శాలియగు మాతండ్రి ప్రాయోపవేశమున మృతినొంది తన వెన్నముకచేత పాచికలు చేయించి జూదమాడించి పాండవులకు గోపము పుట్టించి నీయన్నలం జంపిన దుర్యోధనాది భ్రాతృశతమును పాండవులచేతఁ జంపింపుము, నీపగయుం దీఱును. భూభారముం దగ్గునని చెప్పినకతనఁ దండ్రియానతి నెఱవేర్చితిని. మనుష్యునకు చావు నిక్కమగుట నేనునుం గూలితిని. కీర్తి శాశ్వతము గాని ధనాదులు గావు. మీరీమాటలం బట్టి యన్నినీతులు నూహించుకొనుండు. నాకనుజ్ఞ యిండు.
కృష్ణ—దుర్యోధన! వింటివి గద! ఇఁక నెవారిని నిందింపఁ దలఁచితివో చెప్పుము?
దుర్యో—సంసార మిట్టిదికదా యని యెఱుఁగఁజాలని నన్నె నేనే నిందించుకొందును.

(అని ప్రాణము విడుచుటకై నిశ్చేష్టుఁ డగుచున్నాఁడు)

(తెరలోఁ గలకలము.)

కృష్ణ—యుధిష్ఠిరా! ఒడలెఱుంగని సంతోషములో దుర్యోధనుండు పడినప్పటి నుండియు భీష్మాదులు నీకుఁ బట్టాభిషేకముసేయు సంభారములు సమకట్టుచున్నారు విను మదె వారి యుత్సాహధ్వనులు.
ధర్మ—ఇపుడు నేనేమి చేయవలయును?
కృష్ణ—పట్టాభిషిక్తుఁడవై హస్తినాపురమునకు జనవలయును.

(అంతట భీష్మాదులు నలువురును, ధౌమ్యుఁడు, పౌరులు సాత్యకి పట్టాభిషేకసన్నాహముతో వచ్చుచున్నారు)

ధౌమ్య—యుధిష్ఠిరా! కృష్ణానుగ్రహంబున రిపుమర్దనం బొనర్చి జయముం గాంచితివి.
ధర్మ—గురువర్య! మీరును దీనిని రిపుమర్దనము క్రింద నే భావించుచున్నారా!
భీమ—(తనలో) అన్నగారికి శ్మశానవైరాగ్యము కలుగుచున్నది కాఁబోలును.

కృష్ణ—ధౌమ్యాచార్య! మాటలకంటె ముందు మనసన్నాహము పనను చేయవలెను
ధౌమ్యు—అన్నియు సిద్ధముగా నున్నవి.
మ. ఇదె వాఃపూరిత కాంచనాంచిత ఘటంబు
(అని తన చేతిలోని దానిం జూపును.
ఈరెండుఁ బూవండ లీ
యదె సౌవర్ణమణిప్రకల్పితము దీవ్యత్పట్టమా భీము చే
తిది సౌభాగ్య కిరీటమల్లదె కడుందీపించుదండంబు బె
ట్టెదు డా పార్థుఁడుపట్టె నాతపలుపాటించెట్టి రారాత్రికల్.
(అని యుంపటిం జూపుచున్నాఁడు)
కృష్ణ—(భీముని చేతికిరీటముందుకొని ధర్మజు తలంబెట్టి పూదండలు మెడవైచి రా
దండము చేతికిచ్చి) ధౌమ్యాచార్య! జలంబులభిషేకింపుము.
ధౌమ్యు—(మావిడాకుతోఁ జల్లును)
"శ్లో. యత్రయోగీశ్వరః కృష్ణోయత్రపార్థోధనుర్ధరః
తత్రశ్రీర్విజయోభూతిః ధ్రువానీతిమతిర్మమ."
(అనిచదువును)
(పిమ్మట నకులసహదేవులు నీరాజనము నిచ్చుచున్నారు)
ధౌమ్యు—నిత్యశ్రీరస్తు! నిత్యమంగళానిభవంతు!
కృష్ణ—హస్తినాపురాధీశ! అని మ్రొక్కుచున్నాఁడు.
భీము—(ధర్మజు నుద్దేశించి)
గీ. చిన్నతనము చేతఁబన్నము ల్వడియుంట, దూరదృష్టి లేకఁదోసమంచుఁ
దెలియలేక మిమ్ముఁదిట్టఁబిచితిం గొంత, కరుణజూచిన న్నుఁగావవలయు.
(అని మ్రొక్కుచున్నాఁడు)
కృష్ణ—తనతప్పులన్నియు నీకు గానికపట్టిన యీభీమసేనునకు దృతరాష్ట్రిసమక్షమున
యౌవరాజ్యమిచ్చి గౌరవింపవలయును.
ధౌమ్యు—తథాస్తు.
అర్జు—గీ. అధికగర్వమునను హంభావమున నోర్పు, లేనికారణమునఁ నేనొనర్చి
నట్టిలోపముల నమస్తము క్షమియింప, నీకచెల్లు మేదినీశత్ర!
అని నమస్కరించుచున్నాఁడు)
ధౌమ్యు—స్వాతిశయము పోనాడుకొనుటకై మీరను మాటలే కాని క్షమింపవేఁడుకొన
వలసినంతటి యపచార మీరీరాజుపట్ల నెన్నడు నొనర్పరు.

ధర్మ—తమ్ములారా !

చ. కదలిన నేమనుష్యుఁడను గానను బెట్టుగ నన్నుఁ బెట్టి నా
బెదరున మీరె సర్వమును భీకర లీలల నోర్చినారు నేఁ
గదనమునందుఁ జేసినది కాన నొకింతయు మీరు గూర్చి కీ
పదవిని మీవశం బయితి బాటిగ నన్నడపింపుఁ డింతే.

ధౌమ్య—పాండుసుతులార ! అన్నగారంత భారమును మీమీఁదనె యుంచినారు.

కృష్ణ—ధర్మరాజునకు ధర్మార్థ కామమోక్షములవంటి మీ నలువురును దోడ్పడి యే
లించి సౌఖ్యపడుండు. పాండుపుత్రులారా ! మీకష్టంబులు గట్టెక్కినవి.

చ. తలఁపకుఁ డీర్ష్యచే నొరుల దండనసేయుఁగ దుష్టమిత్రులం
గలనయినం గడింపకుఁడు గాఢపు నెచ్చెలికైన నేర్పునన్
దెలిసి జహీశ్చరిత్రమును దిప్పకు పెద్దలమాట పాటిగా
మలయుఁడు కూడు నెదురభిమానము సఖ్యము నొంది యుండుఁడీ.

ధౌమ్య—కౌంతేయులార! యీమాధవు నీతివాక్యములే మీ కూఁత యగుంగాత !

సాత్య—యుధిష్ఠిరమహారాజ ! సాత్యకి మ్రొక్కులస్వీకరింపుము.

ధర్మ—మీయున్నదమ్ముల యాదరణమే నాకీయున్నతపదవికిఁ గారణము.

కృష్ణ—ఇంకిట నేమిపని ? మీమీవాంఛితములు చేకూరినవి. మీప్రతిజ్ఞలు చెల్లినవి-
మఱి మీకేమి కావలయును.

పాండవులైదుగురు—నీకటాక్ష మొక్కటియే.

ధౌమ్య—తథాస్తు.

(అ) యందరును నడచుచుండఁగా)

"యాశ్రీవో నామమాహాత్మ్యం యా దేవీ సర్వమంగళా
తయోస్సంస్మరణాత్పుంసాం సర్వతో జయమంగళమ్."

(అ[illegible]ను [illegible]స్మరించుచున్నారు.)

ఇది శ్రీ[illegible] మణచరణారవిందమిళిందంబగు
శ్రీ[illegible] సూర్యరాయ విరచిత
దుర్యోధనాభిమాననాటకము
న[illegible]ంబును సప్తమాంకము.

